# లయనిజం విధి-విధానాలు

# LIONISM DUTIES & PROCEDURES




తెలుగుసేత

లయన్ డా॥ జి.వి. పూర్ణచంద్, B.A.M.S.

జోన్ చైర్మన్ 1997-98

ప్రచురణ

లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ మెగాసిటీ

## ప్రార్థన

సర్వేశ్వరా! ఇది నా ప్రార్థన!
నా హృదయ దౌర్బల్యము తొలగింపుము
సుఖ దుఃఖములను సమభావముతో
భరింపగల మనోబల మొసంగుము.
ప్రేమానురాగములతో పేదలకు
సేవచేయగల శక్తి నొసంగుము
నిరుపేదలను తిరస్కరింపక,
ధనాధికుల ముందు మోకరిల్లక
నిలుచు బలమునిమ్ము
దైనందిన సమస్యలకు అతీతమైన
మనో నిర్మలత్వ మొసంగుము
నా సర్వస్వము అనురాగముతో
నీకు అర్పించుకొనే
మనోవాంఛ ప్రసాదింపుము

## పతాక వందనం

మన జాతీయ పతాకానికి మేము వందనం చేసి మా భక్తి విశ్వాసాలను వెల్లడిస్తున్నాము.

ఉత్తమ పౌరుడి బాధ్యతలను నెరవేర్చడంలో మనలో ప్రతి ఒక్కరూ ప్రదర్శించే శ్రద్ధాసక్తుల మీద దాని గౌరవం, ప్రాభవం ఆధారపడి వున్నాయి.

సువర్ణ అక్షరాలతో వ్రాయబడిన దాని పవిత్ర చరిత్ర మన దేశానికి చక్కటి కీర్తిని సాధించేందుకు మనకు ప్రోత్సాహాన్ని అందజేస్తుంది.

మన జాతీయ పతాకం పట్ల అచంచల విశ్వాసాన్ని ప్రకటిస్తూ, అక్షరాలా ఆ మార్గములోనే నడుస్తామనీ, మనలో ప్రతి ఒక్కరూ దాని ప్రాభవవైభవాల్ని పెంపొందింప చేయడానికి ఎంతగానో కృషి చేసి దేశదేశాలలో సగర్వంగా సమున్నతంగా అది ఎగిరేటట్లు చేస్తామనీ ప్రకటిస్తున్నాము.

# లయనిజం
# విధి-విధానాలు

# LIONISM
# DUTIES & PROCEDURES




తెలుగుసేత

**లయన్ డా॥ జి.వి. పూర్ణచంద్,** B.A.M.S.

జోన్ ఛైర్మన్ 1997-98

ప్రచురణ

**లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ మెగాసిటీ**

నెం. 28-3-49, సంజీవయ్య కాలనీ, అరండల్‌పేట, విజయవాడ - 2. ఫోన్ : 434320



**Ln. SYED PARWEZ HASHMI**
District Governor



**Ln. Dr. M.A. PADMANABHAM**
Vice-District Governor



**Ln. Dr. G.V. PURNACHAND**
Editor-in-Chief

## HON. ADVISORY COMMITTEE



**Ln. T. SRIHARI RAO**
Past Dist. Governor



**Ln. CHIGURUPATI VARAPRASAD**
Imm. Past Dist. Governor



**Ln. B. BENERJEE BABU**
Governor's Area Representative



**Ln. Dr. V. RAMALINGESWARA RAO**
Club President



**Ln. V.L. NARASAREDDY**
Club Secretary



**Ln. D. VAASU BABU**
Club Treasurer



**Ln. P. KAMESWARA SARMA**
Editor: Mega Times

## LIONS CLUB OF VIJAYAWADA MEGACITY : DIST 324 C-1

# MESSAGE



It gives me an immense pleasure to note that Ln. Dr. G.V. PURNACHAND who is also a popular writer in Telugu, has put in a wonderful maiden attempt to bringout useful TIPS of Lionism. It is updated to the latest possible for use of the club level leaders to be more informative in discharge of their duties. It is also heartening to note that this book is brought out in our Mother Tongue, in an easier style. So that, most of the Club Leaders could keep this book as a guide of reference in their day to day Lionistic activities.

I am also happy to note that a New Club "Lions Club of Vijayawada Mega City" has comeforward to publish this book and I heartly congratulate all the well informed Lions who have put in their efforts in bringing out this useful book.

I feel it a necessity for those new members who are invited into our fold to know more about Lionism and this Book provides the necessary information. I congratulate once again.

Be Indian serve the Globe through Lionism

Yours at "CARE"

(Ln. SYED PARWEZ HASHMI)
*District Governor*



# ముందుమాట

## లయన్ తాతినేని శ్రీహరి రావు

*పాస్ట్ డిస్ట్రిక్ట్ గవర్నర్*

**లయన్ డా॥ పూర్ణచంద్** ఆధ్వర్యంలో రూపుదిద్దుకున్న ఈ "లయనిజం విధి విధానాలు" ప్రతి లయన్ పరిశీలించి ఆచరించతగ్గది. ఇందు ప్రతి సాధారణ లయన్ సభ్యుడు తెలుసుకోతగ్గ అనేక విషయాలు సులభశైలిలో సాధ్యమైనంత ఖచ్చిత సమాచారం అందించబడ్డది. ఇటీవలే వచ్చిన మార్పులు సైతం పొందుపరచ బడ్డాయి ఇందులో.

మన లయన్స్ సమావేశాలలో ప్రార్ధన, పతాకవందనం పఠించటంలో సాధారణంగా దొర్లుతున్న తప్పులు గుర్తించి దీనికి క్లిష్ట భాష కారణమని భావించి వాటిని సులభతరం చేస్తూనే మౌలిక భావాన్ని సుందరంగా మలచబడ్డ ప్రయత్నం అభినందనీయం.

ప్రతి లయన్ విధిగా అవగాహన చేసికొని ఆచరించవలసినవైనా నిత్యం విస్మరిస్తున్న "లయన్స్ ఆదర్శాలు, ప్రవర్తనా నియమావళి" సులభశైలిలో తెలిగించబడ్డవి. మౌలిక సూత్రాలపై ప్రతివారికి అవగాహన కల్గించాలనే భావంతో.

ఉరకలు వేస్తున్న ఉత్సాహంతో అనితరసాధ్యమైన సేవలు అందించాలనీ, పరిపాలనా పరంగా మరింత ఉన్నతిపొందాలనీ బాధ్యతలు స్వీకరించిన నూతన కార్యవర్గ సభ్యులకు, ముఖ్యంగా అధ్యక్ష, కార్యదర్శి, కోశాధికారులకు వారి ఆశయ సాఫల్యానికి కావలసిన "TIPS" ఈ పుస్తకంలో చేర్చబడ్డవి, వారు చేపట్టవలసిన బాధ్యతల విపులీకరణతోపాటు.

మన జిల్లాలో ఇతఃపూర్వం వెలువడ్డ లయనిజం పై పుస్తకాలలో దొరకని అనేక విషయాలు ఇందు చేర్చటం ప్రత్యేకించి ప్రశంసనీయం.

విషయసేకరణలో సంపాదకవర్గం ప్రత్యేకించి Ln. Dr. **పూర్ణచంద్**గారి నిశిత పరిశీలనా దృష్టి ఎంతైనా ఎన్నతగ్గది. నిత్యం మార్పులు చెందుతూ బహుదా విస్తరించివున్న మన లయన్స్ నియమ, నిబంధనలు సమగ్రంగా ఈ చిన్ని పుస్తకంలో పొందుపరచటం సాధ్యం కానందున, నిత్యం అనుసరించదగ్గ విషయాలకు మాత్రమే పరిమితం చేయబడ్డ ప్రయత్నంగా లయన్ మిత్రులు గమనించకోర్తాను.

మిత్రుల సూచనల మేరకు మున్ముందు మరిన్ని విషయాలపై మరిన్ని పుస్తకాల రాకకు ఈ పుస్తకం ప్రేరణ కావాలని ఆకాంక్షిస్తూ మిత్రులందరినీ అభినందిస్తున్నాను.

# శుభాకాంక్షలు



**లయన్ చిగురుపాటి వరప్రసాద్, MJF**
**(Immediate Past Dist-Governor)**

స్వచ్ఛమైన తెలుగులో లయనిజం గురించి స్పష్టంగా అందరికీ అర్థమయ్యే విధంగా "**లయనిజం: విధి విధానాలు**" అనే ఈ పుస్తకాన్ని లయన్ **డా॥ జి.వి. పూర్ణచంద్** వెలువరించారు. అందుకు ఆయనకు ముందుగా నా శుభాకాంక్షలు.

కొత్తగా లయనిజంలో చేరిన సభ్యులకూ, లయన్స్ క్లబ్‌ల కార్యవర్గాలకూ ఎంతో అవసరమైన సమాచారం ఈ పుస్తకంలో వుంది. ప్రోటోకాల్ నిబంధనల్నీ కార్యక్రమాలను మరింత సమర్థవంతంగా నిర్వహించే పద్ధతుల్నీ చక్కగా మంచి అవగాహన కలిగేలా వివరించడం జరిగింది.

లయనిజం ఇమేజ్‌ని పెంపొందింపచేసేలా లయన్స్ సభ్యుల్ని తీర్చిదిద్దే ఇలాంటి మంచి పుస్తకాలు భవిష్యత్తులో మరిన్ని డా॥ పూర్ణచంద్ వెలువరించాలని కోరుకొంటున్నాను.

కొత్త క్లబ్ అయినప్పటికీ, **లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ మెగాసిటీ** వారు ఈ పుస్తకాన్ని ప్రచురించడానికి ముందుకు వచ్చినందుకు వారికి నా అభినందనలు అందిస్తున్నాను.

మనిషి మానవుడిగా ఎదగాలి. మానవత్వం విశ్వవ్యాప్తం కావాలి. మానవుడు విశ్వమానవుడై లోకకళ్యాణం కోసం దీక్షాకంకణుడు కావాలి.... ఇదే అంతర్జాతీయ సేవాసంస్థ "లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్" ఆశయం!

లయనిజం మూడు ముఖ్యమైన నినాదాలతో పనిచేస్తోంది.

**స్వేచ్ఛ (Liberty)**

బానిసత్వపు సంకెళ్ళు తెంచుకొని మనిషి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో సుఖజీవనం సాగించాలనేది లయనిజం మొదటి నినాదం.

**ప్రతిభ (Intelligence)**

సమాజంలో ఉన్నత స్థానంలో ఉన్న వ్యక్తులు తమ ప్రతిభా సంపత్తులు ఉపయోగించి అట్టడుగు ప్రజల అభివృద్ధికి తోడ్పడాలనేది లయనిజం రెండవ నినాదం.

**దేశభద్రత (Our Nation's Safety)**

మన దేశ భద్రత, మన జాతి సంక్షేమం, మన చుట్టూ ఉన్న సమాజ అభ్యున్నతి, మన సంస్కృతి, తరతరాల మన చారిత్రక వారసత్వాల పరిరక్షణే ధ్యేయంగా మనలో ప్రతి ఒక్కరూ పనిచేయాలనేది లయనిజం మూడవ ముఖ్య నినాదం!

ఈ మూడు నినాదాలలో LIBERTY లోంచి 'L' అనే అక్షరాన్నీ, INTELLIGENCE లోంచి 'I' అనే అక్షరాన్నీ, OUR NATION'S SAFETY లోంచి "ONS" అక్షరాన్నీ తీసుకొని "LIONS" గా రూపొందించారు.

అమెరికాలోని కొలొరాడోకు చెందిన HAISTED RITTER అనే ఆయన 'LIONS' అనే పదానికి ఈ అర్థాన్ని రూపొందించాడు. 1919 జూలై 9-12 తేదీలలో చికాగోలో జరిగిన మూడవ లయన్స్ అంతర్జాతీయ సమ్మేళనంలో ఈ అర్థాల్ని ఆమోదించడం జరిగింది.

## మనం సేవలు అందిద్దాం
**OUR MOTTO - WE SERVE**

లయనిజంలో నేను, మేము అనే మాటలకు తావు లేదు. ఇక్కడ ''మనం'' అనే భావనతోనే మనందరం పనిచేయాలని లయనిజం మనల్ని నిర్దేశిస్తోంది. "We serve - మనం సేవలు అందిద్దాం'' అనేది లయనిజం ధ్యేయం (Motto)

1954లో జరిగిన అంతర్జాతీయ లయన్స్ కాన్ఫరెన్స్‌లో అభిప్రాయ సేకరణ చేసి ఈ "We serve" ని మన ధ్యేయంగా నిర్ణయించడం జరిగింది.

## రెండు సింహాల గుర్తులో ఎన్నో నిగూఢమైన అర్థాలున్నాయి
**OUR EMBLEM**

కాలిఫోర్నియాకు చెందిన "Maurice Blink" ఈ రెండు సింహాల గుర్తుని రూపొందించాడు. దీన్ని 1921లో అంతర్జాతీయ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ ఆమోదించారు. 1919 సం॥లో దీన్ని రూపొందించే విషయంలో రెండు అభిప్రాయాలేర్పడి, బంగారు రంగుమధ్య 'L' అక్షరాన్ని కొందరు, సింహం శిరస్సును కొందరూ సూచించినప్పుడు రెండు అభిప్రాయాలనూ గౌరవిస్తూ ఈ గుర్తును రూపొందించారు. గుర్తు మధ్య 'L' అనే అక్షరం స్వేచ్ఛకూ (Liberty), ప్రేమకూ (Love), విధేయతకూ (Loyalty) శ్రమకూ (Labour), జీవితానికీ (Life)..... అలాగే ''లయన్స్''కూ సంకేతంగా వాడడం జరిగింది.

'L' చుట్టూవున్న వృత్తం ఈ విశ్వవ్యాప్తిని గుర్తుచేస్తుంది. అంతర్జాతీయంగా వున్న లయన్స్ క్లబ్‌ల మధ్య, లయన్స్ క్లబ్ సభ్యుల మధ్య వున్న సాన్నిహిత్యానికి, సమైక్యతకూ ఇది గుర్తు

**రెండు సింహాలు చెరొక దిక్కుకూ చూస్తున్నట్లు కన్పిస్తాయి**

★ తూర్పు పడమరలుగా విడిపోయిన రెండు విభిన్న సంస్కృతులు - తూర్పు సంస్కృతి - పాశ్చాత్య సంస్కృతులకు ఈ రెండు సింహాలూ ప్రతీకలుగా నిలుస్తాయి.

★ ఉన్నతమైన సేవలు అందించటానికి ఎక్కడ ఏ చిన్న అవకాశం దొరికినా దాన్ని సద్వినియోగం చేసుకోవడానికి అన్ని కోణాలలోనూ వెదుకుతున్నట్లుగా కూడా ఈ రెండు సింహాలూ అటూ ఇటూ అవలోకిస్తూ కన్పిస్తాయి.

★ జరిగిపోయిన వాటిలోంచి అనుభవాల్ని నేర్చుకోవడానికి ఒక సింహం ఇటు చూస్తోంది. అనుభవాల పాఠాలు నేర్చుకొని భవిష్యత్తుకు బంగారుబాట వేయాలని ఇంకొక సింహం భవిష్యత్ వైపుకు తేరిచూస్తోంది.

★ చీకటిలో మగ్గుతున్న జీవితాలకు చేయూతనందించాలని ఒక సింహం అన్నార్తుల్ని అన్వేషిస్తోంది. ఆపన్నులను ఆదుకొనే దాతలకోసం మరొక సింహం వెలుగులో వున్నవారిని వెదుకుతోంది.

★ లయనిజంలో పరిపాలనా పరమైన (Administrative) కార్యకలాపాల గురించి ఒక సింహం, సేవా కార్యక్రమాల గురించి ఇంకొక సింహం రెండు రకాల యాక్టివిటీలకు గుర్తులుగా కన్పిస్తాయి.

## లయన్స్ గుర్తులో రెండు రంగులు
### COLOURS OF EMBLEM

రెండు సింహాల లయన్స్ గుర్తు వున్న గోల్డ్‌కలర్ లేపెల్‌పిన్‌ను చూడండి... ఇందులో గోల్డ్, ముదురు నీలం (పర్పుల్) రంగులు కన్పిస్తాయి. బంగారు రంగు అనేది పనిలో నిజాయితీనీ, స్వేచ్ఛనూ, నిర్ణయశక్తినీ, స్వచ్ఛతనూ, దాతృత్వాన్నీ సాటి మానవులపట్ల దయాదాక్షిణ్యాలను సూచిస్తుంది. అలాగే నీలిరంగు అనేది - దేశం పట్ల విధేయతనీ, మానవుల పట్ల అణకువనూ, మనసుకీ, హృదయానికీ వుండే బంధాన్నీ సూచిస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే మనసా వాచా కర్మణా మనిషి అణకువతో సాధించుకున్న సమర్థతకు ఈ నీలిరంగు సంకేతంగా నిలుస్తుంది. సమర్థతకు, సహనానికీ, స్వేచ్ఛకూ, సాహసానికి (Courage) నిబద్ధతకూ (Commitment) అంకితభావానికీ (Dedication) ఈ నీలిరంగు సంకేతంగా లయనిజం మనకు చెప్తుంది.

## లయన్స్ జెండా
### THE FLAG

బంగారు రంగుతో కూడిన పసుపు పచ్చని జెండాని లయన్స్ జెండాగా ఎగరేస్తారు. ముదురు నీలిరంగు (Purple) అంచు ఈ జెండాపై వుంటుంది. మధ్యలో ఆరు రంగుల్లో రెండు సింహాల లయన్స్ గుర్తు ముద్రితమై వుంటుంది.

## సేవ చేయడానికి సింహమే ఎందుకు కావాలి?
### "LION" IS A LION

రాజసంతోపాటు క్రమశిక్షణ సింహం ప్రత్యేకత అని మన అందరికీ తెలుసు. సుఖాలలోనే కాదు, కష్టాలలోకూడా సింహం తన హుందాతనాన్ని ఎప్పుడూ

నిలబెట్టుకొంటుంది. సమస్యల్ని అర్థంచేసుకోవడంలోగానీ, సమస్యల్ని పరిష్కరించడంలో గానీ, సమస్యల్ని ఎదుర్కొనడంలో గాని, సమస్యల్ని అధిగమించడంలోగానీ ప్రతిభావంతమైన రీతిలో సింహంలా ముందుకురికి సమాజంలోని పీడిత వర్గానికి చేయూతనిమ్మనే సందేశంతోనే లయనిజం పుట్టింది. పేదరికాన్ని రూపుమాపడానికి సింహంలా ప్రతి ఒక్కరూ చెలరేగాలని ఆకాంక్ష!

## హు ఈజ్ ఎ లయన్........??

- ★ జీవితంలో విజయాలు సాధించిన వాడు (Who achieves success)
- ★ జీవించడం నేర్చినవాడు (Lives well)
- ★ కమ్మగా నవ్వగల్గినవాడు (Laughs Often)
- ★ సాటి మానవుల పట్ల ప్రేమాదరాలు కల్గినవాడు (Loves all Mankind)
- ★ మేధావులు గౌరవించేవాడు (Gains respect of intelligents)
- ★ చిన్నపిల్లలు సైతం ప్రేమించే ప్రేమైకమూర్తి (gains Love of little children)
- ★ జీవితంలో అన్ని సమస్యలూ అధిగమించే ఆదర్శమూర్తి (Fills his niche)
- ★ సమర్థుడిగా బాధ్యతలు నెరవేర్చేవాడు (Does his work well)
- ★ భగవంతుడు తనని ఏ మూల పుట్టించినా, దాన్ని సుందరనందన వనంగా తీర్చిదిద్దే వాడు (makes the corner of earth where God has placed him a better place than it was before)
- ★ జీవితకుసుమంలోని సుగంధాలను, అందాలను, ఆస్వాదించి ఆనందించేవాడు (Feels the glow of beauty in all life, and never fails to voice his praise of it)
- ★ సాటివారిలో మంచిని మాత్రమే ఎంచేవాడు (Sees the best there is in his fellowmen)
- ★ ఇతరులకు తనలో మంచిని మాత్రమే పంచగల్గినవాడు (gives the best there is in him)
- ★ అతని జీవితం ఎందరికో ఉత్తేజకరమై ఆదర్శజీవిగా ఎదిగినవాడు (Whose life is one vast inspiration)

*దట్ మాన్ ఈజ్ ఎ లయన్!!*

## ప్రజాసేవకు సమర్ధవంతంగా పూనుకోవడమే లయనిజం లక్ష్యం

**OBJECTS OF LIONISM**

ఏ సంస్థకయినా కొన్ని నిర్దిష్ట లక్ష్యాలుంటాయి. వాటికి అనుగుణంగానే ఆయా సంస్థలు పనిచేస్తాయి. వీటిని "ఆబ్జెక్ట్స్" అంటారు. లయనిజానికి ఆరు ఆబ్జెక్టులున్నాయి.

1. ప్రపంచంలో వున్న మనుషులందరి మధ్యా సదవగాహనని కల్గించి అభివృద్ధిపరచి, వారిలో స్నేహ సౌభ్రాతృత్వ భావనని పెంపొందించడం.
2. బాధ్యతాయుత పరిపాలన, బాధ్యతాయుత పౌరసత్వాలకు సంబంధించిన సూత్రాలను పాటింపచేయడం.
3. సామాజికమైన, సాంస్కృతికమైన, పౌరసంబంధమైన, నైతికపరమైన అంశాలలో ముఖ్యమైన భాగస్వామ్యం వహించి సమాజ సంక్షేమంకోసం పాటుపడడం.
4. అంతర్జాతీయంగా వున్న లయన్స్ క్లబ్‌లన్నింటినీ ఒకే త్రాటిమీదకు తెచ్చి, వాటిమధ్య బలమైన స్నేహ సౌభ్రాతృత్వాలను పెంపొందించి చక్కటి అవగాహన కలిగేలా సమైక్యపరచడం.
5. ప్రజా సంబంధమైన ప్రతి సమస్యకు సంబంధించి బహిరంగ చర్చావేదికలు నిర్వహించడం లయనిజం లక్ష్యాలలో ఒకటి!

   అయితే, పాక్షిక ధోరణులు, రాజకీయపరమైన అంశాలు, మతతత్వానికి సంబంధించిన అంశాలపైన ఈ ప్రజావేదికలలో చర్చించరాదని లయనిజం నిర్దేశిస్తోంది.
6. సేవా తత్పరత కల్గిన వ్యక్తులను ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేకుండా ప్రజా సేవా కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనేలా ప్రోత్సహించడం, వారిలో వ్యక్తిత్వ వికాసాన్ని నైతికతనూ పెంపొందింపచేయడం, వారి వారి వ్యాపార, పారిశ్రామిక రంగాలలోనూ వారి వారి వృత్తులలోనూ వారి పనితనాన్ని, నేర్పరితనాన్ని, కౌశలాన్ని పెంపొందించడం... ఇవన్నీ లయనిజం లక్ష్యాలు.

## లయన్స్ ప్రవర్తనా నియమావళి
## LIONS CODE OF ETHICS

లయనిజంలో సభ్యుడిగా ప్రవేశించిన ప్రతివ్యక్తీ నిత్యజీవితంలో కూడా నైతిక విలువల్ని నిలబెట్టుకొంటూ, తనని తాను మెరుగుపరుచుకొంటూ నిజమైన లయన్‌గా జీవించాలని లయనిజం మననుంచి ఎంతో ఆశిస్తోంది. అందుకు సూచనగా కొన్ని ప్రవర్తనా నియమాలను నిర్దేశిస్తోంది.

★ వృత్తి పరంగా గానీ, వ్యాపార పరంగాగానీ, ఉద్యోగపరంగా గానీ కష్టించి పనిచేయడం ద్వారా ఉన్నతమైన, గుణాత్మకమైన సేవలు ఆసాంతం అందిస్తూ మంచి పేరు తెచ్చుకోవాలని నేను ఆశిస్తున్నాను. అందుకు నా శక్తిసామర్ధ్యాల పట్ల సంపూర్ణ విశ్వాసాన్ని ప్రకటిస్తున్నాను. అంటే, సేవాదృక్పథాన్ని అలవరచుకొని కష్టపడి పనిచేస్తూ, అందరికీ ఉపయోగపడుతూ నిజ జీవితంలో పైకి రావాలని ఈ నియమంలో మనకు సూచించడం జరిగింది.

★ వృత్తిలో కష్టపడినదానికి తగిన ప్రతిఫలం కోరేప్పుడు న్యాయంగా నాకు రావలసినంతమేర మాత్రమే స్వీకరిస్తాను. అంతేకానీ, ఆత్మగౌరవానికి భంగకరంగా, అవినీతిమయంగా, ఇతరులు వేలెత్తిచూపే విధంగా ఎన్నటికి ప్రవర్తించను.

★ నా వ్యక్తిగత అభివృద్ధి కోసం ఇతరుల నాశనాన్ని కోరేలా ప్రవర్తించకూడదని ఎప్పటికీ నేను గుర్తుంచుకొంటాను. అంతేకాదు, నా వృత్తివ్యాపారాలకు సంబంధించిన వ్యక్తులపట్లగానీ, నా ఖాతాదారుల పట్లగానీ ఎప్పుడూ విశ్వాసపాత్రుడిగానే మెలగుతాను.

★ నా వృత్తి వ్యాపారాలలో నైతికంగా ఏది సరైన నిర్ణయం..... అనే మీమాంస వచ్చినప్పుడు పదిమందికీ ఉపయోగపడే నిర్ణయాన్నే నేను తీసుకొంటాను...... అది వ్యక్తిగతంగా నాకు నష్టం కల్గించేదే అయినా సరే!

★ స్నేహం అనేది చిరకాలం సాగే ఒక పరమావధి. అంతేగానీ, స్వార్ధప్రయోజనాల కోసం కాదు. స్నేహం అనేది ఒకరికోసం ఇంకొకరు చేసుకొనే సాయాన్ని లెక్కలు గట్టి తూచేది కాదు. ప్రతిఫలాన్ని కోరేదీ కాదు. సేవాదృక్పథంతో సాయపడితేనే స్నేహానికి సార్థకత వుంటుంది. ఏ ఉదాత్త భావంతో సేవ అందించారో అంతే ఉదాత్తతో దాన్ని స్వీకరించగలగాలి.

★ బాధ్యతగల్గిన ఒక పౌరుడిగా నా దేశంపట్ల, నా రాష్ట్రం పట్ల, నా సమాజం పట్ల నా విధ్యుక్తధర్మాన్ని నేనెప్పుడూ మరిచిపోను. మనసా వాచా కర్మణా వాటికి నా విధేయతను ప్రకటిస్తున్నాను. అందుకోసం నా సమయాన్ని, నా శ్రమనూ, నా సేవల్నీ, ఉదారంగా అందిస్తాను.

★ ఆర్తులకూ ఆపన్నులకూ నా సహాయ సానుభూతుల్ని ఎల్లకాలం ఎంతో ఔదార్యంతో అందిస్తాను.

★ ఎదుటివారిలో తప్పులెన్నే ధోరణిని విడనాడి మంచిని గుర్తించే అలవాటును పెంపొందించుకొంటాను. నాచర్యలు నిర్మాణాత్మకంగానే వుండాలి తప్ప వినాశకరం కాకూడదని ఆశిస్తున్నాను.

## లయనిజంలో ఉన్నత సాంప్రదాయాలు
## GOOD TRADITIONS IN LIONISM

లిఖిత పూర్వకంగాలేని రాజ్యాంగంలా, లయనిజంలో కొన్ని విధిగా పాటించవలసిన సాంప్రదాయాలున్నాయి. వాటిని తెలుసుకొని ఆచరించడం లయన్స్‌గా మన బాధ్యత.

★ మానవతా విలువలు కల్గిన ఒక అంతర్జాతీయ సంస్థలో సభ్యులమనే గౌరవభావాన్ని సూచిస్తూ లయన్స్ గుర్తుకల్గిన లేపెల్‌పిన్‌ని మనం ధరిస్తున్నాం.

★ "నీకన్నా ఎవరూ ఎక్కువా కాదు-
నీకన్నా ఎవరూ తక్కువా కాదు-
నీకోసం.... నీతో సమానంగానే అంతా....!! అంటుంది లయనిజం. లయనిజంలో సభ్యత్వం పొందిన తర్వాత తమసేవలు అందించే విషయంలో అందరూ సమానులే!

★ లయనిజం ద్వారా అందించనున్న సేవలు కేవలం స్వచ్ఛందమైనవే (voluntary) గానీ నిర్బంధ పూర్వకం కావు. ఇలా చేసితీరాలని, మీ స్వంత సమయాన్ని, ధనాన్నీ ఖర్చుపెట్టి తీరాలని ఎవ్వరూ మీమీద వత్తిడి తీసుకురాలే రు. సేవాతత్పరత కల్గిన వ్యక్తులను లయనిజంలోకి తీసుకురావడం ద్వారా వారిలో అప్పటివరకూ నిద్రాణంగావున్న సేవాభావాలను మేల్కొల్పి, సమాజ సేవపట్ల వారు అంకితమయ్యేలాగా ప్రోత్సహించడమే లయనిజం లక్ష్యం!

★ లయనిజాన్ని బాగా జీర్ణించుకున్న వ్యక్తి నిజజీవితంలో కూడా పవిత్రంగా నిలబడి, ఉత్తమ పౌరుడిగా పరిణతి చెందుతాడు. వ్యక్తిత్వ వికాసాన్ని పొందగలుగుతాడు. అలా మనగలగాలనేదే మన సాంప్రదాయం.

★ ఏ క్లబ్‌లో సభ్యులయినా, లయన్స్ అంతా ఒకరినొకరు పరస్పరం గౌరవించుకొంటూ, విశ్వాసంతో, సాన్నిహిత్యంతో హుందాగా మెలగడం కూడా ఇటువంటి సాంప్రదాయమే! దీన్నే "ఫెలోషిప్" అంటాం మనం. స్నేహ భావంలేని వారికి సేవాభావం ఎలావుంటుందీ...?? అందుకే, ఫెల్లోషిప్‌ను ఆస్వాదించాలనే ఉద్ధేశంతోనే ప్రతి సమావేశంలోనూ కొంతసమయాన్ని ఇందుకోసం కేటాయించారు.

★ క్లబ్ సమావేశాలకు సభ్యులు విధిగా హాజరుకావాలి. ఇది సాంప్రదాయం! హాజరుకాకుండా తప్పించుకొని తిరిగేవారూ, హాజరయినప్పటికీ మౌనంగా వుండే సభ్యులూ సంవత్సరాంతంలో తమకేమీ చెప్పకుండా చేసుకుపోతున్నారని ఆరోపిస్తుంటారు. వీరిపట్ల క్లబ్ నాయకులు తప్పనిసరిగా జాగ్రత్తగా వుండాలి.

## లయనిజం ఇలా పనిచేస్తుంది

## HOW LIONS CLUBS INTERNATIONAL IS ORGANISED

★ నాలుగునించి ఎనిమిది లయన్స్ క్లబ్‌ల్ని ఒక జోన్‌గా వ్యవహరిస్తారు. జోన్‌కు జోన్ ఛైర్మన్ నాయకుడు.

★ పదినుంచి పదహారు లయన్స్ క్లబ్‌లు ఒక రీజియన్ క్రిందకు వస్తాయి. ఈ రీజియన్‌కు రీజియన్ ఛైర్మన్ నాయకుడు.

★ కొన్ని రీజియన్స్ కలిపి ఒక లయన్స్ డిస్ట్రిక్ట్ ఏర్పడుతుంది. కొన్ని డిస్ట్రిక్ట్‌లు కలిసి ఒక "మల్టిపుల్ డిస్ట్రిక్ట్" అవుతుంది. ఇది "కౌన్సిల్ ఆఫ్ గవర్నర్స్" చేత పాలించబడ్తుంది. ఈ కౌన్సిల్‌కు ఓ ఛైర్మన్, ఓ వైస్‌ఛైర్మన్, ఓ సెక్రటరీ, ఓ ట్రెజరర్ వుంటారు. వీరి పదవీకాలం ఒక సంవత్సరం.

★ ప్రపంచవ్యాప్తంగా వున్న లయనిజాన్ని, అంతర్జాతీయ అధ్యక్షులు ఇమ్మీడియేట్ పాస్ట్‌ప్రెసిడెంట్, ఇద్దరు ఉపాధ్యక్షులు, 32మంది డైరెక్టర్లు వీరుకాక అంతర్జాతీయ అధ్యక్షుడు నామినేట్ చేసిన డైరెక్టర్లు వీరందరూ ఇంటర్నేషనల్ బోర్డ్‌గా ఏర్పడి పాలన సాగిస్తారు.

## జాతీయ జెండాను ఎగుర వేసేప్పుడు ఈ జాగ్రత్తలు తీసుకోండి

**KEEP THE HONOR OF NATIONAL FLAG**

జాతీయ జెండా దేశ గౌరవ ప్రతిష్టలకు గుర్తు. జెండాను ఉపయోగించే విషయంలో విశ్వవ్యాప్తంగా కొన్ని నియమ నిబంధనలున్నాయి. వాటిని నిర్లక్ష్యం చేయడం అంటే ఆ దేశాన్ని అగౌరవ పరచడమే! లయన్స్ క్లబ్ సమావేశాలలో జాతీయ జెండాను ఎగురవేసేటప్పుడు ఖచ్చితంగా ఈ నిబంధనలను పాటించాలి.

1. మాసిపోయిన, చిరిగిపోయిన జెండాను ఎగురవేయకండి.
2. పైన కాషాయం, క్రింద ఆకుపచ్చ రంగులు వుండేట్లు జెండాను ఆవిష్కరించండి. జాతీయ జెండా రూపకల్పనలో నిబంధనలు పాటించండి.
3. జాతీయ జెండాతో తోరణాలు కట్టడం, అలంకారాలు చేయడం నిషిద్ధం. మొత్తం సభాస్థలిలో ఒకే ఒక జాతీయ జెండా వుండాలి. ఆ జెండా మీద ఏ అక్షరాలూ రాయకూడదు.
4. సభలో నిర్దిష్ట సమయాన సగౌరవంగా జాతీయ జెండాను వేదికపైకి తీసుకువచ్చి వేదికకు కుడివైపున వినయ విధేయతలతో, భక్తి విశ్వాసాలు వెల్లడిస్తూ దానిని ప్రతిష్టించాలి. జెండా ప్రతిష్టాపన జరిగేప్పుడు అందరూ నిలబడి జాతీయ గీతాలాపన చేయాలి.
5. జెండాను ఎగురవేసేప్పుడు వేగంగా ఎగురవేయాలి. దించేప్పుడు నిదానంగా అవనతం చేయాలి.
6. సూర్యోదయం అయిన తరువాతే జెండాను ఎగురవేయాలి. సూర్యాస్తమయం అయ్యాక అంటే, సరిగ్గా సాయంత్రం ఆరుగంటలకు జాతీయ జెండాను అవనతం చేయాలి. ఆ సమయానికి సభలో అన్ని కార్యక్రమాలు ఆపి, లేచి నిలబడి గౌరవ ప్రపత్తులతో జెండా అవనతం చేయాలి. అవనతం చేసేప్పుడు పొరబాటున కూడా జెండా నేలను తాకకుండా జాగ్రత్త తీసుకోండి.
7. జాతీయ జెండాను వ్యక్తులు తమ వాహనాలకు కట్టుకొని తిరగడం నేరం.
8. వందనపూర్వకంగా జాతీయ జెండాను ఎవరి గౌరవంకోసం ఎవ్వరిముందూ వంచరాదు.
9. ప్రభుత్వం, సైన్యం అధికారికంగా నిర్వహించే అంత్యక్రియల సమయంలో తప్ప, ఇతరులు ఎవరు మరణించినా వారి శవాల మీద జాతీయ జెండాను కప్పకూడదు.

10. దేశ నాయకులు ప్రముఖులు మరణించినప్పుడు మాత్రమే జాతీయ పతాకాన్ని అవనతం చేయాలి.

11. జాతీయ గీతాలాపన జరిగేప్పుడు, మౌనంగా నిలబడి దేశభక్తిని చాటుకోవాలి. పతాకవందనం చదివేప్పుడు కూడా ఇలాగే మౌనంగా నుంచోవడం విధిగా పాటించాలి.

12. ఇతర జెండాలతోపాటుగా జాతీయ జెండాని ప్రతిష్ఠించినప్పుడు జాతీయజెండాను తక్కిన జెండాలకు కుడివైపునగానీ, లేదా మధ్యలో, వాటికన్నా ఎత్తుగా వుండేట్లుగానీ అమర్చాలి.



## లయనిజం పితామహుడు మెల్విన్‌జోన్స్

## MELVIN ZONES : FATHER OF LIONISM

1879 జనవరి 13న జన్మించిన మెల్విన్ జోన్స్ మహనీయుడు న్యాయవాదిగా విద్యాభ్యాసం చేసి, ఇన్సూరెన్స్ రంగంలో వ్యాపారం ప్రారంభించారు. జాన్సన్ అండ్ హిగ్గిన్స్ కంపెనీ వారు ఆ రోజుల్లో ఇన్సూరెన్స్ బ్రోకర్స్‌గా వుండేవారు. మెల్విన్‌జోన్స్ ఆ సంస్థకు కొంతకాలం ఏజెంట్‌గా పనిచేసి, ఆ తర్వాత చికాగోలో స్వంతవ్యాపారం ప్రారంభించారు. ''మెల్విన్‌జోన్స్ ఇన్సూరెన్స్ ఏజెన్సీ'' దాని పేరు. కానీ, 38 సంవత్సరాల వయస్సులోనే తన ధనార్జనను త్యాగంచేసి లయనిజం కోసం తననితాను అంకితం చేసుకున్నారు.

1917లో ''అసోసియేషన్ ఆఫ్ లయన్స్ క్లబ్స్''కు ఆయన శ్రీకారం చుట్టారు. లయనిజం కోసం ఆయన చేసిన త్యాగాలకు గుర్తుగా ఆయన నిర్వహించిన ''సెక్రటరీ జనరల్'' పదవిని రద్దుచేశారు. ఆయన ఇంటర్నేషనల్ అధ్యక్షుడి పదవిని ఏనాడూ కోరుకోలేదు. ఆ పదవిని చేపట్టనూ లేదు.

1939లో క్యూబా ప్రభుత్వం ఆయనకు ఆ దేశపు అత్యున్నతమైన ప్రశంసాపత్రాన్ని ఇచ్చి గౌరవించింది. 1945లో ఐక్యరాజ్యసమితిలో లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ ప్రతినిధిగా దాని రూపకల్పన కోసం నియమించబడ్డారు. అనేక దేశాలు మానవతావాదిగా ఆయన్ని గుర్తించి గౌరవించాయి.

1961 జూన్ 1న ఆయన పరమపదించారు. రోడ్ ఫ్రీమెన్ ఆయన ధర్మపత్ని. ఆమె 1938 సంవత్సరంలో గోల్ఫ్ ఆటకు సంబంధించిన అంతర్జాతీయ సంఘానికి అధ్యక్షురాలిగా ఆమె పనిచేశారు. 1954లో ఆమె మరణించారు. ఒంటరితనంతో రెండు

సంవత్సరాలు దుర్భరంగా గడిపిన తర్వాత విలియన్ ఎం. రాడిగాన్ అనే ఆమెను వివాహమాడారు మెల్విన్‌జోన్స్.

44 సంవత్సరాల సుదీర్ఘ లయన్స్ సేవలో తాదాత్మ్యం చెందిన మహనీయుడు మెల్విన్ జోన్స్ - తన 82వ ఏట అన్నార్తులను ఆదుకొనే ఒక మహత్తర మానవతామయమైన అంతర్జాతీయ సంస్థను ఈ మానవాళికి అందించగలిగాననే సంతృప్తితో తన భౌతికకాయాన్ని ఈ లోకానికి విడిచి 1961 జూన్ 15న అనంత లోకాలకు పయనమైనారు.



## లయనిజం విశ్వవ్యాపితం
## LIONISM IS INTERNATIONAL

★ 184 దేశాలలోనూ, ప్రాంతాలలోనూ లయనిజం శాఖోపశాఖలుగా విస్తరించి మహావృక్షమై నిలిచింది.

★ అమెరికాలోని ఇల్లినాయిస్ రాష్ట్రంలోని చికాగో నగరంలో ఓక్ బ్రూక్ ప్రాంతంలో 300 22 వీధిలో లయన్స్ అంతర్జాతీయ కార్యాలయం వుంది.

★ 10 ఎకరాల విశాలస్థలంలో పెద్ద స్వంత భవంతిలో ఈ కార్యాలయం వేలాదిపర్యాటకుల్ని అనునిత్యం ఆకర్షిస్తోంది.

★ 40 దేశాలకు చెందిన 350కి పైగా ఉద్యోగులు ఈ కార్యాలయ సముదాయంలో దీక్షగా పనిచేస్తున్నారు. సమర్థవంత పరిపాలనకు ప్రపంచంలో లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ పెట్టింది పేరు.

★ ఆధునిక కంప్యూటర్ల సాయంతో లయనిజాన్ని ప్రపంచ వ్యాప్తంగా ఒకే కేంద్రం నుంచి నడిపిస్తోంది ఈ కార్యాలయం.

★ జపాన్ లయన్స్ ఈ భవంతి చుట్టూ ఏర్పరచిన "జపనీస్ గార్డెన్" అక్కడి ఓ ప్రత్యేక ఆకర్షణ.

★ పదకొండు భాషల్లో లయనిజం స్టడీ మెటీరియల్ ఎప్పటికప్పుడు ప్రచురితమౌతోంది.

★ ఈ అంతర్జాతీయ కార్యాలయం నుంచి 100కి పైగా ప్రచురణలు విడుదల అవుతున్నాయి. ఆడియో/విజువల్ మెటీరియల్స్ లెక్కలేనన్ని ఇక్కడినించి పంపబడుతున్నాయి.

★ ఇంగ్లీషు, చైనా, ఫిన్నిష్, ఫ్రెంచి, జెర్మనీ, ఇటాలియన్, జపనీస్, స్వీడిష్ భాషలు లయనిజం అధికార భాషలుగా గుర్తించబడ్డాయి (ఇందులో భారతీయుల హిందీ భాషలేదు)

## లయనిజం ఇలా మొదలయ్యింది

**HISTORY OF LIONISM**

1917 సంవత్సరంలో అమెరికాలోని చికాగో నగరంలో 'మెల్విన్‌జోన్స్' ప్రేరణతో లయన్స్ ప్రపంచ కుటుంబ భావనకు అంకురార్పణ జరిగింది. ఒక వ్యక్తి తాను వ్యక్తిగతంగా చేయగలిగిన దానికన్నా, అనేకమంది సేవా పరాయణులు సామూహికంగా సాధించగలిగేది ఎక్కువ..... కాబట్టి, అంతర్జాతీయ స్థాయిలో ఒక క్లబ్‌ను ఏర్పాటు చేయడానికి ఆనాడు ప్రయత్నాలు ప్రారంభమైనాయి.

★ 1917 మే నెలలో మెల్విన్ జోన్స్ ఈ దిశగా వివిధ వ్యక్తులతో సంప్రదింపులు ప్రారంభించి, ఒక సమావేశం ఏర్పాటు చేసేందుకు సంకల్పించారు.

★ 1917 జూన్ 7న అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని వివిధ ప్రాంతాలలోంచి వచ్చిన ప్రతినిధులు చికాగోలోని ఒక హోటల్‌లో సమావేశమై "అసోసియేషన్ ఆఫ్ లయన్స్ క్లబ్స్"ను స్థాపించారు. మెల్విన్ జోన్స్ దాని కార్యదర్శి అయ్యారు.

★ 1917 అక్టోబర్ 8, 9, 10 తేదీలలో టెక్సాస్ రాష్ట్రంలోని డల్లాస్ నగరంలో జరిగిన సమావేశంలో లయన్స్ రాజ్యాంగాన్ని ఆమోదించారు.

★ 1918 నవంబర్‌లో అప్పటి కార్యదర్శి, కోశాధికారి కూడా అయిన మెల్విన్ జోన్స్ మొదటి లయన్స్ క్లబ్ మ్యాగజైన్ వెలువరించారు. ఆ తర్వాత అది "THE LION"గా మారింది.

★ అమెరికా సంయుక్త రాష్ట్రాల వెలుపల మొదటి లయన్స్ క్లబ్ 1920లో కెనడాలోనూ, 1926-27లలో చైనా, మెక్సికో, క్యూబా దేశాలలో ప్రారంభమై లయనిజం అంతర్జాతీయతని సంతరించుకొంది.

★ ఇప్పటికి ఈ ఎనభై సంవత్సరాలలో రమారమి 43వేల లయన్స్ క్లబ్‌లు ఏర్పడ్డాయి.

## ఇండియాలో లయనిజం కథా కమామిషు

**LIONISM IN INDIA : A SKETCH**

ఒక జ్యోతితో అనేక జ్యోతులు వెలిగించవచ్చునన్నట్లే అంతర్జాతీయ స్థాయిలో 184 దేశాలలో లయనిజం- ఒక క్లబ్ నుంచి మరో క్లబ్ ఉద్భవిస్తూ- విశ్వవ్యాప్తమయ్యింది. 1996-97 సంవత్సరంలో కంబోడియా, బోస్నియా, హెర్జిగోవినా దేశాలలో కూడా లయన్స్ క్లబ్‌లు కొత్తగా ప్రారంభమై ఆయాదేశాలు కూడా లయన్స్ ప్రపంచ పటంలో చేరాయి.

1956లో ఇండియాలో మొదటి లయన్స్ క్లబ్ ఏర్పడింది. అంతకు మునుపు లయన్ రాబర్ట్ విలియమ్స్ అనే అమెరికన్ ఆర్మీ ఆఫీసర్ స్కౌట్స్ ఆఫీసర్‌గా ఇండియాలో పర్యటించాడు. ఆ పర్యటనలో నోషిర్ కె.జె. ఖాన్, కైకి.బి. గోద్రెజ్ అనే ఇద్దరు స్కౌట్ ఆఫీసర్‌లు పరిచయం అయ్యారు. అప్పట్లో నోషిర్ ఎన్. పుండోల్ అనే స్కౌట్ ఆఫీసరును 18మంది స్కౌట్ల టీమ్‌కు నాయకుడిగా అమెరికాకు పంపడం జరిగింది. ఈ టీమ్‌కు అమెరికాలో రాబర్ట్ విలియమ్స్ ఆతిథ్యం ఇవ్వడం, పరిచయాలు స్నేహంగా మారడం అనేవి పునాదిగా లయనిజం ఇండియాలో కాలూనింది. మొదటగా లయన్స్‌క్లబ్ ఆఫ్ బోంబే, వెంటనే లయన్స్ క్లబ్ ఆఫ ఢిల్లీ క్లబ్‌లు ఏర్పడ్డాయి. ఈరెండు క్లబ్‌ల్నీ లయన్స్ క్లబ్ ఆఫ "శాక్స్‌టన్ పెన్ సిల్వేనియా" స్పాన్సర్ చేసింది.

పైన చెప్పిన ముగ్గురు స్కౌట్ ఆఫీసర్‌లు ఇండియాలో లయనిజం వ్యాప్తికి ఎంతగానో కృషిచేశారు. అప్పట్లో ఇండియా, బర్మా, సిలోన్ దేశాలు మూడూ కలిసి ఒక లయన్స్ డిస్ట్రిక్ట్‌గా వుండేవి. 304 సమైక్య డిస్ట్రిక్ట్ అది.

లయన్ నోషిర్ యన్. పుండోల్ 1956లో మొదటి డిస్ట్రిక్ట్ గవర్నర్‌గా నియమింపబడి, తర్వాత గవర్నర్‌గా ఎన్నికయి 1959 వరకూ కొనసాగారు. 1960లో సౌత్‌ఈస్ట్ ఆసియా దేశాలకు సంబంధించిన కార్యాలయాన్ని ఇండియాలో ప్రారంభించారు. లయన్ పుండోల్ మొదటి కార్యదర్శి అయ్యారు. ఆయన పరిపాలనా కాలంలోనే సింగపూర్, మలేషియా, థాయిలాండ్ దేశాలలో కూడా లయనిజం విస్తరించింది.

1964లో లయన్ పుండోల్ ఇండియా తరపున మొదటి ఇంటర్నేషనల్ డైరెక్టర్‌గా ఎన్నికయ్యారు. ఆయన స్థానంలో కీ॥ శే॥ లయన్ మినూ జె.డి. ఇంజనీర్ సౌత్ ఈస్ట్ ఆసియా కార్యదర్శిగా నియమితులయ్యారు. కంబోడియా, లావోస్, వియత్నాం, బ్రూనెల్ దేశాలలో లయనిజం వ్యాప్తి పొందడానికి ఆయన దోహదపడ్డారు. ఇప్పుడు మనం ప్రతినెలా పంపిస్తున్న MM & A రిపోర్ట్స్ బోంబే ఆఫీసుకు పంపించే పద్ధతిని ఆయనే ప్రారంభించారు. క్లబ్ ఎక్కౌంటింగ్ జమాఖర్చులన్నీ బోంబేలోని ఈ కార్యాలయంలోనే లెక్కలు చూసే పద్ధతిని ఆయనే మొదలుపెట్టారు. ఆయన చేసిన సేవలకు గుర్తుగా లయన్స్ ఇంటర్నేషనల్ 'అంబాసిడర్ ఆఫ గుడ్‌విల్" అనే ప్రతిష్టాత్మక అవార్డును ఇచ్చి గౌరవించింది.

1976లో లయన్ నవరోజ్ యన్. పటేల్ క్లబ్స్ ఎక్స్‌టెన్షన్ ప్రతినిధి- అంటే, కొత్త క్లబ్‌ల స్థాపనకు సంబంధించిన విభాగం అధిపతిగా నియమితులయ్యారు. భారతదేశంలో లయన్స్ క్లబ్‌లు ముమ్మరంగా వ్యవస్థాపించబడడానికి ఆయన కారకులు

ప్రస్తుతం విస్పీమినూ ఇంజనీర్ సౌత్ ఈస్ట్ ఏసియా కార్యదర్శిగా సమర్థవంతంగా బాధ్యతలు నెరవేరుస్తున్నారు. మినూ జె.డి. ఇంజనీర్ తనయుడే ఈయన.

## అంతర్జాతీయ స్థాయికి ఎదిగిన ఇండియన్ లయన్స్

| | | |
|---|---|---|
| లయన్ నోషిర్ యన్. పుండోల్ | ఇంటర్నేషనల్ డైరెక్టర్ | 1964-66 |
| లయన్ బిహారీ అగర్వాల్ | ,, | 1976-78 |
| లయన్ ప్రేమ్‌చంద్ ఆర్. బాఫ్నా | ,, | 1980-82 |
| లయన్ అశోక్ మెహతా | ,, | 1986-88 |
| లయన్ పి.యస్. రంగనాథన్ | ,, | 1988-90 |
| లయన్ సుషీల్ అగర్వాల్ | ,, | 1990-92 |
| లయన్ యం.యల్. తుల్సియాన్ | ,, | 1992-94 |
| లయన్ కమలేష్ జైన్ | ,, | 1994-96 |
| లయన్ జి. రామస్వామి | ,, | 1996-98 |
| లయన్ రోహిత్ సి. మెహతా | అంతర్జాతీయ అధ్యక్షుడు | 1992-93 |

***75వ లయన్స్ అంతర్జాతీయ సమావేశం (ప్లాటినం జూబ్లీ సంవత్సరం)లో 1992-93 సంవత్సరానికి లయన్ రోహిత్ సి. మెహతా ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ అయ్యారు. 80 సంవత్సరాల అంతర్జాతీయ లయనిజం చరిత్రలో 41 సంవత్సరాల భారతదేశ లయనిజం చరిత్రలో భారతీయులకు ఇది ఎంతో గర్వకారణమైన విషయం. ఆసియాలోనే వీరు రెండవ వ్యక్తి కావడం విశేషం.***

### 324 C-1 లయన్స్ జిల్లా

మన లయన్స్ డిస్ట్రిక్ట్ 324 C-1 జిల్లాలో మొదటి క్లబ్ లయన్స్‌క్లబ్ ఆఫ్ విశాఖపట్నం. ఇది 6-11-58న ప్రారంభమైంది. ఆ తర్వాత డిసెంబర్ 23న విజయవాడ లయన్స్‌క్లబ్ ప్రారంభమైంది. మనజిల్లాలో వందకుపైగా లయన్స్‌క్లబ్‌లు, దాదాపు నాలుగువేలమంది లయన్స్ సభ్యులు ప్రజాహిత కార్యక్రమాలు నిర్వహిస్తూ దీక్షగా లయనిజం వ్యాప్తికి కృషిచేస్తున్నారు.

# డిస్ట్రిక్ట్ కాన్ఫరెన్స్

## LIONS DISTRICT CONFERENCE

లయనిజంలో క్లబ్‌ల పరిపాలనకు సంబంధించి అత్యున్నత చర్చా వేదికగా డిస్ట్రిక్ట్ కాన్ఫరెన్స్‌ను భావించాలి.

1. రానున్న సంవత్సరానికి పాలకుల్ని (జిల్లా గవర్నర్, వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్) ఎన్నుకోవడం ఈ సమావేశంలో జరుగుతుంది.

2. డిస్ట్రిక్ట్ తరపున చేపట్టే ప్రాజెక్ట్‌లు - వాటి జమా ఖర్చులు, పరిపాలనాపరమైన అన్ని నిర్ణయాలను తీసుకోవడానికి ఈ సమావేశం ఉద్ధేశించబడింది. అంతేకాదు, అంతర్జాతీయ స్థాయిలో పరిపాలనాపరమైన కొత్త ప్రతిపాదనగాని, సవరణలుగాని తీసుకోమనికోరుతూ, తగిన విధంగా చర్చించి ప్రతిపాదనలు పంపేందుకు ఈ సమావేశం వేదికగా ఉపయోగపడుతుంది.

3. ఇది జిల్లాలోని లయన్స్ అందరూ విధిగా పాల్గొనాల్సిన సర్వసభ్య సమావేశం. కేవలం కొందరు ముఖ్య నాయకులు, క్లబ్ అధ్యక్ష కార్యదర్శులు వంటివారు మాత్రమే హాజరైతే చాలు.... మనకెందుకులెమ్మనే నిర్లిప్త ధోరణి లయనిజంలో వుండకూడదు. ఎందుకంటే, ఈ సర్వసభ్య సమావేశంలోనే అతిముఖ్యమైన పాలనాపరమైన విధాన నిర్ణయాలను తీసుకోవడం జరుగుతుంది కాబట్టి.

4. ప్రతి లయన్స్ క్లబ్ సాధ్యమైనంత ఎక్కువమంది లయన్స్ సభ్యులతో ఈ సమావేశానికి హాజరు కావాలి. 'ఫెల్లోషిప్'ను పెంచుకోవడానికి ఈ సమావేశం అతి చక్కటి సాధనం.

5. క్లబ్ తరపున హాజరైన సభ్యులు విధిగా రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. రిజిస్ట్రేషన్ నిమిత్తం నిర్దిష్ట రుసుం చెల్లించాలి. చెల్లించిన వారికి మాత్రమే చర్చలలో పాల్గొనే అవకాశం, అర్హత కలుగుతాయి.

6. మన మల్టిపుల్‌లో వున్న ప్రతి లయన్స్ డిస్ట్రిక్ట్ కాన్ఫరెన్స్‌లోనూ కనీసం 50 మంది లయన్స్ సభ్యులు "కోరమ్"గా నిర్ణయించడం జరిగింది. అదే మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కాన్ఫరెన్స్‌కు కనీసం 100 మంది సభ్యులు "కోరమ్" అవుతారు.

## డిస్ట్రిక్ గవర్నర్ ఎన్నికలు
## DISTRICT GOVERNOR'S ELECTIONS

గవర్నర్ పదవీకాలం ఒక లయనిస్టిక్ సంవత్సరం. డిస్ట్రిక్ట్ గవర్నర్‌ని డిస్ట్రిక్ట్ కాన్ఫరెన్స్‌లో ఎన్నుకోవడం జరుగుతుంది. డిస్ట్రిక్ట్ గవర్నర్‌తో పాటుగా వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్‌కు కూడా ఇదే సమయంలో ఎన్నికలు జరుగుతాయి. వైస్ గవర్నర్‌గా ఒక సంవత్సరం పదవీకాలం పూర్తిచేసిన వ్యక్తిమాత్రమే గవర్నర్‌గా ఎన్నిక అయ్యేందుకు అవకాశం వుంటుంది.

ఈ ఎన్నికల్లో ఓటు వేయడానికి లయనిజంలో ఒక ప్రత్యేకమైన పద్ధతిని అవలంభిస్తారు.

1. ప్రతి పదిమంది సభ్యులకూ ఒక ఓటు చొప్పున కేటాయిస్తారు. యాభైమంది సభ్యులున్న ఒక లయన్స్ క్లబ్‌కు ఐదు ఓట్లు వస్తాయన్నమాట. ఐదుగురు సభ్యులకన్నా ఎక్కువ వుంటే మరో ఓటు అదనం. అంటే, 55 మందికి మించి వుంటే ఆరో ఓటు కూడా దక్కుతుందన్నమాట!
2. క్లబ్ సభ్యుల సంఖ్యనిబట్టి ఇలా వచ్చిన ఓట్లను ఓట్ చేయడానికి క్లబ్‌లో ఎవరికి కేటాయించాలనేది తర్వాత చర్చనీయాంశం కదా! బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ అందరూ కూర్చుని ఒక నిర్ణయం తీసుకొంటారు. దాని ప్రకారం ఆయా వ్యక్తులకు ''క్రెడెన్షియల్స్ '' ఇస్తారన్నమాట! ఆ లయన్స్ క్లబ్, అలాగే క్రెడెన్షియల్స్ పొందే సభ్యులు సభ్యత్వ బకాయిలు లేకుండా (Good Standing) వుండాలి. ఇది ముఖ్యమైన విషయం.
3. క్లబ్‌కు ఎన్ని ఓట్లున్నాయో అంతమంది ఓటర్లు, వారు ఏకారణంచేతనైనా హాజరు కాలేని పక్షంలో అంతమంది ప్రతినిధి ఓటర్లను (Alternative Voters) ముందుగానే నిర్ణయించి, వారి పేర్లను డిస్ట్రిక్ట్ కార్యాలయానికి పంపవలసి వుంటుంది. ఓటర్లు కూడా గుడ్ స్టాండింగ్‌లో (సభ్యత్వ బకాయిలు లేకుండా) వుండాలి.
4. ఎవరు ఓటు చేస్తున్నారో వారు విధిగా డిస్ట్రిక్ట్ కాన్ఫరెన్స్‌లో రిజిస్ట్రేషన్ చేయించుకొని తీరాలి. లేకపోతే ఓటువేయడం సాధ్యం కాదు.
5. లయనిజంలో ఓటు చేయాల్సిన అవసరం వున్న ప్రతి విషయంలోనూ ఇదే రూలు వర్తిస్తుంది. వాడిగా వేడిగా చర్చలు జరిగి తీర్మానాలు చేయాల్సిన అంశాలు ఓటింగ్‌కు పెట్టవలసి వచ్చినప్పుడు కూడా ఈ ఓటర్లే ఓటు వేస్తారు.
6. జిల్లా సమావేశాల్లో స్వయంగా హాజరైతేనే ఓటు వేయడానికి ఆస్కారం వుంది. అంటే, పరోక్షంగా ఓటు (Proxy Voting) వేసే అవకాశం లయనిజంలో లేదన్నమాట.

## లయన్స్ డిస్ట్రిక్ట్ గవర్నర్ మరియు ఆయన పాలనామండలి

## DISTRICT GOVERNOR & HIS CABINET FORMATION

★ లయన్స్ జిల్లా గవర్నర్ అంటే, మన లయన్స్ డిస్ట్రిక్ట్‌లో అత్యున్నత అధికారి. అలాగే లయన్స్ జిల్లాకు ప్రథమ సేవకుడు కూడా!

★ లయన్స్ క్లబ్ ఇంటర్నేషనల్ ఆఫీసర్‌గా ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరక్టర్స్‌కు బాధ్యుడిగా, లయన్స్ జిల్లాలోని క్లబ్‌లన్నింటి ప్రతినిధిగా ఆయన వ్యవహరిస్తారు. జిల్లాలోని క్లబ్‌లపైన పర్యవేక్షక అధికారి కూడా ఆయనే!

★ జిల్లాలో వున్న లయన్స్ క్లబ్‌లన్నింటి మధ్యా సత్సంబంధాలు నెలకొల్పడం గవర్నర్ బాధ్యత.

★ జిల్లా గవర్నర్‌గా సంవత్సరం పదవీకాలంలో కనీసం ఒకసారి లయన్స్ జిల్లాలోని ప్రతి క్లబ్‌ని సందర్శించడం, అధికార పర్యటన జరపడం ఆయన విధి.

★ క్యాబినెట్ మీటింగ్‌లూ, డిస్ట్రిక్ట్ కాన్ఫరెన్సూ, అలాగే ఇతర డిస్ట్రిక్ట్ సమావేశాలూ గవర్నర్ అధ్యక్షతన జరుగుతాయి.

★ డిస్ట్రిక్ట్ క్యాబినెట్ ఆఫీసర్లపైన ఇతర డిస్ట్రిక్ట్ కమిటీ ఛైర్మన్లపైనా పర్యవేక్షక అధికారం గవర్నర్‌దే.

★ డిస్ట్రిక్ట్ ఆదాయవ్యయాలకు జవాబుదారీ కూడా గవర్నర్‌గారిదే!

★ పరిపాలనా సౌలభ్యంకోసం తన పాలనా మండలిని (డిస్ట్రిక్ట్ క్యాబినెట్) తాను పదవీ బాధ్యతలు స్వీకరించేలోపుగా నిర్ణయించి ప్రకటించవలసి వుంటుంది.

★ లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ సభ్యులను, అధ్యక్షులను మరింత ముందుకు తీసుకు వెళ్ళే ప్రతినిధిగా ఈయన నిలబడతారు.

### వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్

★ భారతదేశానికి ఉపరాష్ట్రపతి వంటివాడు వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్. జిల్లా గవర్నర్‌గారికి అన్ని విషయాలలోనూ ఎడ్మినిస్ట్రేటివ్ అసిస్టెంట్‌గా ఈయన వ్యవహరిస్తారు.

★ డిస్ట్రిక్ట్ గవర్నర్‌గా భవిష్యత్తులో పనిచేయవలసి వుంటుంది కాబట్టి అందుకు కావలసిన అనుభవాన్ని, పరిపాలనా దక్షతనూ సమకూర్చుకోవడానికి వైస్ గవర్నర్‌గా సంవత్సరం పదవీకాలం ఆయనకు ఎంతగానో ఉపయోగపడ్తుంది.

★ జిల్లా గవర్నర్‌గారు బాధ్యతగా అప్పగించిన కార్యక్రమాలను సైతం నిర్వహిస్తారు. గవర్నర్‌గారి పరోక్షంలో ఆయన చేపట్టిన కార్యక్రమాలకు వీరు బాధ్యత వహిస్తారు.

★ గవర్నర్ పదవికి పోటీ చేయడానికి వైస్ గవర్నర్‌గా పనిచేయడం ఒక ప్రాథమిక అర్హత.

## జిల్లా పాలనా మండలి

డిస్ట్రిక్ట్ గవర్నర్‌గారు తన క్యాబినెట్ సహచరుల్ని తానే స్వయంగా నామినేట్ చేస్తారు. ప్రతిభ, పని సామర్థ్యాలతోపాటు విధేయతని కూడా దృష్టిలో పెట్టుకొని క్యాబినేట్‌లోకి కొందరు లయన్స్‌ని ఆయన ఆహ్వానించి 'పాలనా మండలి' (District Cabinet)ని ఏర్పాటు చేస్తారు. దీని 'కార్యదర్శి (District Cabinet Secretary) జిల్లా పరిపాలనకు గుండెకాయవంటివాడు.

### కార్యదర్శి

సమావేశాల మినిట్స్‌ని తయారుచేయడం జిల్లా పరిపాలనకు సంబంధించిన రికార్డు తయారుచేయడంతోపాటుగా గవర్నర్‌గారు చేపట్టే ప్రతి కార్యక్రమంలోనూ సహాయకుడుగా నిలబడడం వంటివి ఈ క్యాబినెట్ సెక్రటరీ గారి ముఖ్య విధులు.

### కోశాధికారి

కోశాధికారి (క్యాబినెట్ ట్రెజరర్) జమాఖర్చులు నిర్వహిస్తారు. జమాఖర్చుల వివరాలు ప్రతి క్యాబినెట్ సమావేశంలో అందించడం, క్లబ్‌లు చెల్లించవలసిన బకాయిల విషయాలు పర్యవేక్షించడం ఇవన్నీ పాలనా మండలి కోశాధికారి విధులు.

### ప్రాంతీయ అధికారులు
### REGION CHAIRMEN

★ 10-16 లయన్స్ క్లబ్‌లు కలిసి ఒక రీజియన్ అవుతుంది. రీజియన్ ఛైర్మన్ రీజియన్‌కు నాయకుడు.

★ రీజియన్‌లోని క్లబ్‌లన్నింటినీ కనీసం ఒక్కసారైనా సందర్శించి, క్లబ్ నాయకుల్ని, సభ్యుల్ని పలకరించి వారికి తగిన సూచనల్ని, సలహాల్ని, సాధ్యమైనంత సహకారాన్ని అందించడం రీజియన్ ఛైర్మన్‌గారి బాధ్యతలు.

★ రీజియన్, ఛైర్మన్, జోన్ ఛైర్మన్‌లను అన్ని క్లబ్ కార్యక్రమాలకు, సమావేశాలకూ ఆహ్వానించడం, MM&A Reports పంపించడం ఇవన్నీ క్లబ్‌లు ఎప్పటికప్పుడు చేస్తుండాలి.

★ రీజియన్ ఛైర్మన్‌గారి చేతులమీదుగా క్లబ్ ఇన్‌స్టలేషన్‌గానీ, కొత్త సభ్యుల ఇండక్షన్ (ప్రమాణస్వీకారం)గానీ చేయించవచ్చు.

★ లయనిజంలో రీజియన్ ఛైర్మన్ అనేది గవర్నర్, వైస్ గవర్నర్, క్యాబినెట్ సెక్రటరీ, క్యాబినెట్ ట్రెజరర్‌ల తర్వాత ఉన్నతస్థానం.

★ రీజియన్‌లోని క్లబ్‌ల సంయుక్త సమావేశాన్ని 'రీజియన్ కాన్ఫరెన్స్' అంటారు. ఈ కాన్ఫరెన్స్‌లు ఒక వేడుక కోసం కాకుండా సముచిత చర్చా వేదికలుగా సాగితే ఉపయుక్తంగా వుంటుంది. ఇక్కడ చర్చించి చేసిన తీర్మానాలను జిల్లా పరిపాలనా విభాగం పరిశీలనార్థం పంపవచ్చు. రీజియన్ కాన్ఫరెన్స్‌లు అలంకారప్రాయం కాకూడదు. విలువైన సమయం సద్వినియోగం కావాలి.

## మండలాధ్యక్షులు
## ZONE CHAIRMEN

★ గవర్నర్‌గారి సలహా సంఘం (Governor's Advisory Committee) జోన్ ఛైర్మన్‌గారి నాయకత్వంలో నడుస్తుంది.

★ ఒక్కో జోన్‌లో నాలుగు నుంచి ఎనిమిది వరకూ క్లబ్‌లుంటాయి.

★ ఆయా క్లబ్‌ల అధ్యక్షులు, కార్యదర్శులూ, కోశాధికారులూ, ఉపాధ్యక్షులూ గవర్నర్‌గారి సలహా సంఘంలో సభ్యులుగా వుంటారు.

★ క్లబ్ స్థాయిలో పరిపాలనాపరమైన సేవాపరమైన సూచనలు చర్చించి ఆమోదించినవాటిని గవర్నర్ పరిశీలనకు తెలియచేయవచ్చు.

★ సంవత్సరానికి కనీసం మూడు లేక నాలుగు జోన్ అడ్వయిజరీ సమావేశాలు నిర్వహించాల్సి వుంటుంది.

★ తన జోన్‌లోని అన్ని క్లబ్‌ల బోర్డ్ మీటింగ్‌లకూ జోన్ ఛైర్మన్ హాజరు కావచ్చు. కాబట్టి బోర్డ్ సమావేశాలు, రెగ్యులర్ సమావేశాల ఆహ్వానాల్ని క్లబ్‌లు విధిగా జోన్ ఛైర్మన్‌కు పంపవలసి వుంటుంది.

★ తన జోన్‌లోని క్లబ్‌ల్లో నెలకొన్న పరిస్థితిని వాటి ఆర్థిక విషయాల్ని, వాటి కార్యక్రమాలనూ వాటి సభ్యత్వ వివరాలనూ జోన్ ఛైర్మన్‌గారు పట్టించుకొని, ఆయా క్లబ్‌లకు తన అనుభవం మేరకు తగిన సూచనలిస్తారు. అలాగే రీజియన్ ఛైర్మన్‌తో చర్చించి అవసరమైన సహకారం అందిస్తారు.

## డిస్ట్రిక్ట్ కమిటీ ఛైర్మెన్ (D.Cs)

లయనిజం ద్వారా సేవాకార్యక్రమాలకు సంబంధించిగానీ, లయనిజం పరిపాలనాపరమైన అంశాలకు సంబంధించిగానీ చేపట్టవలసిన వివిధ కార్యక్రమాలకు కొన్ని కమిటీలను డిస్ట్రిక్ట్ గవర్నర్‌గారు ప్రతిపాదించి, వాటికి ఛైర్మన్‌లను నామినేట్ చేస్తారు. ఆయా కమిటీలు సాధారణంగా సింగిల్ మాన్ కమిటీలుగా వుంటాయి. కొన్ని మరి ముఖ్యమైన కమిటీలలో సభ్యులను నియమించవచ్చు కూడా.

ఆయా కమిటీల ఛైర్మన్‌లు కూడా జిల్లాపాలనా మండలిలో (క్యాబినెట్) భాగంగా వుంటారు.

సాధారణంగా జిల్లా గవర్నర్‌గారు ఆయా క్యాబినెట్ సభ్యులను వివిధ పదవులలో నియమించేప్పుడు సమర్థత, లయనిజంపట్ల నిబద్ధతతోపాటుగా, వ్యక్తిగతంగా జిల్లా పాలనా యంత్రాంగంపట్ల విధేయతని కూడా దృష్టిలో పెట్టుకొని తన క్యాబినెట్‌ను రూపొందించడం జరుగుతుంది. ఈ విషయమై గవర్నర్‌గారిదే సంపూర్ణ అధికారం.

## దక్షిణ భారతంలోని లయన్స్ క్లబ్‌లు ఒక మల్టిపుల్ డిస్ట్రిక్ట్

## OUR MULTIPLE DISTRICT

★ ఇండియాలో 321, 322, 323, 324అనే నాలుగు మల్టిపుల్ డిస్ట్రిక్ట్‌లున్నాయి.

★ దక్షిణ భారతదేశంలోని గోవా, ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడు, కేరళ, కేంద్రపాలిత ప్రాంతాలైన పాండిచ్చేరి, అండమాన్ నికోబార్ దీవులలోని లయన్స్ క్లబ్‌లు 324 మల్టిపుల్ డిస్ట్రిక్ట్''లో వున్నాయి.

### మల్టిపుల్ కౌన్సిల్ ఇలా ఏర్పడుతుంది

★ మల్టిపుల్ డిస్ట్రిక్ట్ మల్టిపుల్ కౌన్సిల్ అనే గవర్నింగ్ బోడీ పర్యవేక్షణలో పనిచేస్తుంది.

★ ఈ ఏడాది పదవీకాలం పూర్తిచేసుకొంటున్న (Out Going) జిల్లా గవర్నర్‌లు సంవత్సరాంతంలో జరిగే మల్లిపుల్ డిస్ట్రిక్ట్ సర్వసభ్య సమావేశంలో తమలోంచి ఒకరిని మల్టిపుల్ కౌన్సిల్ ఛైర్మన్‌గానూ, వేరొకరిని వైస్ ఛైర్మన్‌గానూ ఎన్నుకొంటారు.

★ మల్టిపుల్ కౌన్సిల్ ట్రెజరర్ అధికారంలోకి రాబోతున్న (ఇన్‌కమింగ్) గవర్నర్‌లలోంచి ఎన్నిక అవుతారు.

★ మల్టిపుల్ కౌన్సిల్ కార్యదర్శి మాత్రం పదవీ విరమణ చేస్తున్న గవర్నర్‌ల లోంచిగానీ, లేదా పదవిలోకి వస్తున్న గవర్నర్లలోంచిగానీ ఎవరైనా ఎన్నిక కావచ్చు.

★ ఈ నలుగురూకాక, తక్కిన రూలింగ్ (పదవిలోకి వస్తున్న) గవర్నర్‌లందరూ మల్టిపుల్ కౌన్సిల్ సభ్యులుగా వుంటారు.

★ పదవీ విరమణ చేస్తున్న (ఇమిడియేట్ పాస్ట్) గవర్నర్‌లలోంచి సగానికన్నా తక్కువమందిని ఈ కౌన్సిల్ సభ్యులుగా కో-ఆప్ట్ చేసుకోవచ్చు.

★ అంతర్జాతీయ వార్షిక సమావేశానికన్నా కనీసం నెలరోజుల ముందుగా, సంవత్సరాంతంలో మల్టిపుల్ సర్వసభ్య సమావేశం జరుగుతుంది. దక్షిణ భారతదేశంలోని సభ్యులందరూ హాజరయ్యే ఇలాంటి సమావేశాలకు వెడితే ''ఫెల్లోషిప్'' పెరుగుతుంది. లయనిజంపట్ల అంకితభావం కలుగుతుంది.

★ పాలనాపరమైన నిర్ణయాలు తీసుకోవడం, వివిధ సేవా కార్యక్రమాలను సమీకరించి ప్రోత్సహించడం, సభ్యత్వ విషయాలు.... అలాగే ఇంటర్నేషనల్ డైరక్టర్ పదవికి అభ్యర్థిని ప్రతిపాదించడం... ఇవన్నీ ఈ సమావేశంలో జరుగుతాయి.

## లియో క్లబ్స్ - లయనెస్ క్లబ్స్

## OUR AUXILLIARY CLUBS

యువతీ యువకుల్లో నాయకత్వ లక్షణాలు పెంపొందింపచేసి, సమాజంపట్ల బాధ్యతగల్గిన పౌరులుగా వాళ్ళని తీర్చిదిద్దే ఉద్ధేశ్యంతో 'లియో' ఉద్యమాన్ని ప్రారంభించారు.

1968 సంవత్సరంలో అధికారికంగా లియో ఉద్యమాన్ని ఆమోదించారు.

12 సంవత్సరాలు దాటిన యువతీయువకులు 28 సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ లియో క్లబ్‌లో సభ్యుడిగా కొనసాగవచ్చు.

కాంపెటేటివ్ పరీక్షలు శృతిమించి నిర్వహించబడడం వంటి అనేక కారణాల వలన మన యువతీ యువకుల్ని సమాజంపట్ల బాధ్యతగల్గినవారిగా తీర్చిదిద్దే అవకాశం మనదేశంలో ముఖ్యంగా మన రాష్ట్రంలో లేకుండాపోతోంది. సామాజిక కార్యక్రమములవైపు విద్యార్థినీ విద్యార్థులను మళ్ళించడానికి వారికి తగిన సమయం లేకుండా పోతోంది. ఇది దురదృష్టకర పరిణామం. లియో ఉద్యమం బలపడితే రేపటి పౌరుల్ని ఉన్నతులుగా తయారు చేయగల్గుతాం.

### లయనెస్ క్లబ్స్

ఔదార్యానికి, దాతృత్వానికి, కారుణ్యానికి గుర్తులు.... స్త్రీ మూర్తులు! మహిళల్ని కూడా లయన్స్ సేవలో భాగస్వామ్యుల్ని చేయడానికి లయన్ లేడీస్ సంస్థల్ని మొదట ఏర్పాటు చేయడం జరిగింది.

లయన్ సభ్యుల భార్యలు, వారి అవివాహిత కుమార్తెల్ని లయన్ లేడీస్ క్లబ్‌లో సభ్యులుగా చేర్చుకునేవారు.

స్వతంత్ర భావాలు సేవా తత్పరత కలిగిన ఇతర మహిళలను కూడా లయనిజంలోకి తీసుకురావడంకోసం "లయనెస్" ఉద్యమాన్ని 1975 అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా ప్రారంభించారు.

ప్రపంచవ్యాప్తంగా స్త్రీలు ఎంతో ముందంజవేసి సమానత్వాన్ని సాధించు కోగలగడం, మహిళా ఉద్యమాలు అనేకం ప్రారంభం కావడం నేపథ్యంలో "లయనెస్" ఉద్యమానికి బదులుగా స్త్రీలను కూడా "లయన్స్"గా చేర్చుకునే నిర్ణయాన్ని 1987 జూలై 4న తీసుకున్నారు. ఇప్పుడు పురుషులకు దీటుగా స్త్రీలుకూడా అద్భుతంగా సేవాకార్యక్రమాలు చేస్తున్నారు. డిస్ట్రిక్ట్ గవర్నర్ స్థాయికి ఎదిగిన స్త్రీమూర్తులున్నారు.

## లయన్స్ రాజ్యాంగం-నిబంధనలు
## LIONS CONSTITUTION & BY-LAWS

క్లబ్ పరిపాలన విషయంలో రూల్స్, రెగ్యులేషన్స్ వంటివి పాటించడంలో ఎటువంటి సందేహాలకూ అవకాశం లేకుండా లయన్స్ రాజ్యాంగం అన్ని విషయాలనూ ఎంతో స్పష్టంగా విశదీకరించడం జరిగింది.

"రోబర్ట్స్ రూల్స్ ఆఫ్ ఆర్డర్" గ్రంథం ఆసరాగా పార్లమెంటరీ సాంప్రదాయాల విషయంలో ఏవైనా సందేహాలు కలిగితే వాటిని తీర్చుకోవచ్చని లయనిజం మనకు సూచిస్తోంది.

### సవరణలు చేసే విధానం
### AMENDTMENTS

లయన్స్ క్లబ్‌లు ఆమోదించి అవలంభించడం కోసం రూపొందించిన రాజ్యాంగాన్ని అవసరాన్నిబట్టి, స్థానిక పరిస్థితుల్నిబట్టి తగురీతిగా సవరించుకునే అవకాశం వుంది.

★ ఈ సవరణలు లయన్స్ రాజ్యాంగ మౌలిక సూత్రాలకు భిన్నంకానివిగా వుండాలి.

★ జనరల్ బాడీలో ఈ విషయాన్ని ప్రవేశపెట్టడానికి ముందు బోర్డ్‌లో కూలంకషంగా చర్చించి చేయవలసిన సవరణలను రూపొందించవలసి వుంటుంది.

★ రెండు వారాల వ్యవధిలో నోటీసును సభ్యులందరికీ పంపాలి. ఆనోటీసు మీద చేయవలసిన సవరణలను స్పష్టంగా రాసి పంపాలి.

★ 2/3 వంతుల మంది సభ్యులు విధిగా హాజరై మెజారిటీ సభ్యులు ఆ సవరణలను ఆమోదించవలసి వుంటుంది.

## లయన్స్ క్లబ్ ఎన్నికలు
## CLUB ELECTIONS

లయన్స్ క్లబ్‌ల్లో ఎన్నికలు విలక్షణమైన పద్ధతిలో జరుగుతాయి. లయనిజంలో రాజకీయాలు చోటుచేసుకోకుండా ఉండేందుకు, లయనిజంలో ఎప్పుడూ ఒకే వర్గం ముఠాలుగా కట్టి రాజ్యం చెలాయించే పరిస్థితులు ఏర్పడకుండా వుండేందుకు ఎంతో ముందు చూపుతో ఈ విలక్షణమైన ఎన్నికల యంత్రాంగాన్ని రూపొందించడం జరిగింది. అంచెలంచెలుగా ఈ ఎన్నికలు ఇలా జరుగుతాయి.

1. క్లబ్ అధ్యకుడు తన క్లబ్‌లోని పూర్వపు అధ్యక్షులలోంచి ఒకరినిగానీ, లేక సీనియర్ సభ్యుణ్ణిగానీ "నామినేషన్ కమిటీ ఛైర్మన్"గా నిర్ణయిస్తారు. ఈ నామినేషన్ కమిటీ ఛైర్మన్ ఎన్నికల అధికారిగా కూడా వ్యవహరిస్తారు.
2. నామినేషన్ కమిటీలో ఛైర్మన్, అవసరం అయితే ఒకరిద్దరు సభ్యులూ వుంటారు.
3. ప్రతి సంవత్సరం మార్చి నెలలో నామినేషన్ సమావేశం జరుగుతుంది. ఈ సమావేశం ఎప్పుడు ఎక్కడ ఏ సమయంలో జరగాలో బోర్డ్ నిర్ణయిస్తుంది.
4. కనీసం రెండు వారాల కాల వ్యవధిలో ప్రతి సభ్యుడికీ ఈ నామినేషన్ల మీటింగ్ నోటీస్ పంపవలసి వుంటుంది. క్లబ్ సెక్రటరీ నోటీస్‌లు పంపుతారు.
5. ఈలోగా క్లబ్‌లో వివిధ పదవులను ఎవరెవరికి ఇస్తే బావుంటుందో, వారి వారి సమర్థతలు, పరిస్థితులు ఆధారంగా నిర్ణయించుకొని నామినేషన్ కమిటీ ఆయా పదవులకు ఆయా లయన్స్ సభ్యుల పేర్లను నిర్ణయించి సమావేశంలో ప్రతిపాదించడం జరుగుతుంది. ప్రతిపాదిత సభ్యులు అందరూ ఎటువంటి బకాయిలు లేకుండా గుడ్ స్టాండింగ్‌లో వుండాలి.
6. నామినేషన్ కమిటీ ప్రతిపాదించిన పేర్లను జనరల్ బాడీ సభ్యులు ఏకగ్రీవంగా ఆమోదిస్తే ఎన్నికల తతంగం పూర్తయినట్లే!
7. ఏదైనా పదవికి ఎవరైనా ఒక అభ్యర్థి తాను పోటీ పడదలచుకొంటే, ఈ నామినేషన్ సమావేశంలో తన అభ్యర్థిత్వాన్ని ప్రతిపాదించుకోవచ్చు. అయితే, ఆ అభ్యర్థి పేరుని ఒక సభ్యుడు ప్రతిపాదించాలి, మరొక సభ్యుడు బలపరచాలి. ఈ ముగ్గురూ కూడా సభ్యత్వ బకాయిలు లేకుండా 'గుడ్ స్టాండింగ్'లో వుండాలి. అప్పుడే ఆ అభ్యర్థిత్వం పరిగణనలోకి తీసుకోవడం జరుగుతుంది.

8. ఇలా ఏఏ పదవులకు పోటీ ఏర్పడిందో ఆయా పదవులకు మాత్రమే ఎన్నికలు జరుగుతాయి. పోటీలేని పదవులన్నీ ఏకగ్రీవంగా ఎన్నికయినట్లే!!

9. పోటీ అనివార్యం అయినప్పుడు ఎలెక్షన్ సమావేశం ప్రతి సంవత్సరం ఏప్రిల్ 15లోగా జరపవలసి వుంటుంది. వ్రాతపూర్వకంగా రెండువారాల వ్యవధిలో నోటీస్ ఇచ్చి బోర్డ్ సభ్యులు నిర్ణయించిన సమయంలో ఈ ఎన్నికల సమావేశం జరపాలి. ఈ నోటీస్ మీద పోటీ జరుగుతున్న పదవులు, పోటీ పడ్తున్న అభ్యర్థుల పేర్లు ప్రకటించాలి.

10. ఎలెక్షన్ సమావేశంలో కొత్తగా నామినేషన్లు స్వీకరించడం జరగదు. ఎన్నికలు ఏప్రియల్ నెలతోనే ముగిసి పోయినప్పటికీ, కొత్త టీమ్ జులై నెల 1 నుంచి అధికారంలోకి వస్తుంది. జూన్ 30 వరకూ 1 సంవత్సరంపాటు అధికారంలో కొనసాగుతుంది.

## మెంబర్ షిప్ కమిటీ

లయనిజంలో ఇటీవలి కాలంలో కొత్తగా ప్రారంభమైన సాంప్రదాయాలలో మెంబర్ షిప్ కమిటీకి ఎన్నికలు జరపడం ఒకటి. పూర్వం క్లబ్ అధ్యక్షుడే మెంబర్ షిప్ కమిటీని నామినేట్ చేసేవారు. ఇప్పుడు జనరల్ బాడీలో ఎన్నుకోవడం జరుగుతుంది.

1. నామినేషన్ కమిటీయే ఇతర పదవులతోపాటుగా మెంబర్‌షిప్ కమిటీకి ఎన్నికలు జరుపుతుంది.

2. మెంబర్ షిప్ కమిటీలో ఒక ఛైర్మన్, ఒక వైస్ ఛైర్మన్, ఒక సభ్యుడు - మొత్తం ముగ్గురు వుంటారు.

3. మొదటి సంవత్సరం ముగ్గురికీ ఒకేసారి ఎన్నికలు జరుగుతాయి. తర్వాతి సంవత్సరంలో వైస్ ఛైర్మన్ ఛైర్మన్ అవుతాడు. ఈ కమిటీలో సభ్యుడుగా వున్న వ్యక్తి వైస్ ఛైర్మన్‌గా పదోన్నతి పొందుతాడు. అక్కడినించి ప్రతి సంవత్సరం సభ్యుడి పదవికి మాత్రమే ఎన్నికలు జరుగుతాయి. ఇదంతా రొటేషన్ సిస్టమ్‌లో జరుగుతుంది.

3. క్లబ్ మెంబర్ షిప్ కమిటీ ఛైర్మన్ మాత్రం బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌లో ఒకడుగా గుర్తించబడతాడు.

## లయనిజంలో ఏడు రకాల సభ్యత్వాలు

### CLASSIFICATION OF LIONS

**1. ACTIVE MEMBER:**

క్లబ్‌లో అన్ని హక్కులూ, అన్ని బాధ్యతలూ వున్న సభ్యుడు యాక్టివ్ సభ్యుడు అవుతాడు. క్లబ్‌లో ఏ ఆఫీసర్ పదవికైనా ఆయన అర్హుడు. జిల్లాలోగాని, మల్టిపుల్ జిల్లాలోగానీ, అంతర్జాతీయ సమావేశంలోగాని డెలిగేట్‌గా వెళ్ళి ఓటుచేసేందుకుగానీ, లయనిజంలో ఏ స్థాయిలో ఏ పదవినైనా పొందేందుకు ఈయనకు అర్హత వుంది. క్లబ్ సమావేశాలకు సేవా కార్యక్రమాలకు హాజరు కావడం. సభ్యత్వ బకాయిలను వెంటనే చెల్లించడం, సమాజంలో లయనిజం ప్రతిష్ఠ పెరిగేలా ప్రవర్తించడం ఈ యాక్టివ్ సభ్యుడి బాధ్యతలు.

**2. MEMBER-AT-LARGE:**

ప్రవాస సభ్యత్వం లాంటిది ఇది. ఒక సభ్యుడు వేరొక ప్రాంతానికి తరలి వెళ్ళినప్పటికీ తన సభ్యత్వాన్ని ఈ సంస్థలోనే కొనసాగించడాన్ని "మెంబర్-ఎట్-లార్జ్" అంటారు. ఈ సభ్యత్వాన్ని బోర్డ్ సభ్యులు ఆమోదించి, అవసరమైతే ప్రతి ఆరు నెలలకొకసారి పునః సమీక్షిస్తారు. ఈ సభ్యత్వం స్వీకరించిన వ్యక్తి లయనిజంలో ఏ పదవినీ నిర్వహించడు. ఓటు చేయడానికి అర్హుడు కాడు. క్లబ్ నిర్ణయించిన రుసుములను ఎప్పటికప్పుడు చెల్లిస్తుండాలి కూడా!

**3. HONORARY MEMBER:**

సమాజంలో సేవా తత్పరత కలిగి ఉన్నత స్థానంలో ఉన్న వ్యక్తికి మన సంస్థలో గౌరవ సభ్యత్వం ఇచ్చి వారి అనుభవాలను మనం లయనిజం కోసం వినియోగించవచ్చు. కానీ, ఆయనకు సంబంధించిన ఇంటర్నేషనల్, డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ సభ్యత్వ బకాయిలు మాత్రం క్లబ్ తన అడ్మినిస్ట్రేటివ్ నిధుల్లోంచి చెల్లించవలసి వుంటుంది. ఈయన లయనిజంలో ఏ హక్కుల్ని, ఏ అధికారాల్ని పొందడానికి మాత్రం అవకాశం వుండదు.

**4. PRIVILEGED MEMBER:**

ఇదొక ప్రత్యేక హక్కుగల్గిన సభ్యత్వం. కనీసం 15 సంవత్సరాలు యాక్టివ్ సభ్యుడిగా వున్న ఒక లయన్‌కు అనారోగ్య కారణాల వలనగానీ, ఇతర అనివార్య కారణాలవలనగానీ, (ఆయన అభ్యర్ధన మీద) క్లబ్ సమావేశాలకు, కార్యక్రమాలకు, వ్యక్తిగతంగా హాజరు కాకుండా మినహాయింపు నిచ్చే సభ్యత్వం ఇది. ఆయన క్లబ్‌కు కట్టవలసిన సభ్యత్వ బకాయిలు. ఆయన పేరుతో క్లబ్ కట్టవలసిన సభ్యత్వ బకాయిలు అన్నీ యధావిధిగా

చెల్లించాలి. అవసరమైనప్పుడు ఆయన సమావేశాలకు హాజరై ఓటు చేసే అధికారం కూడా ఈ సభ్యత్వంలో వుంది. కానీ, లయనిజంలో ఏ పదవినీ ఆయన పొందే అర్హత మాత్రం వుండదన్నమాట.

**5. LIFE MEMBER:**

20 సంవత్సరాల సుదీర్ఘ కాలం లయనిజంలో సభ్యుడిగా కొనసాగిన వ్యక్తులకు వారు తమ శక్తి సామర్థ్యాలమేర ఈ సమాజంకోసం చేసిన సేవలకు గుర్తింపుగా "జీవిత సభ్యత్వం" ఇస్తారు. అలాగే, 15 సంవత్సరాల లయన్స్ సభ్యత్వం కలిగి, 70 సంవత్సరాలు వయసు దాటిన లయన్స్‌కు కూడా వారి కోరిక మీద "జీవిత సభ్యత్వం" ఇచ్చే అవకాశం ఉంది. అంతేకాదు, ఏ సభ్యుడైనా తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్నప్పుడు వారి వయసు సభ్యత్వ కాలాలతో నిమిత్తం లేకుండా వారి అభ్యర్థన మేరకు జీవిత సభ్యత్వం ప్రసాదించవచ్చు.

జీవిత సభ్యులకు యాక్టివ్ సభ్యులతో సమానంగా అన్ని హక్కులూ, బాధ్యతలూ ఉంటాయి.

వీరు ఒకేసారి 300 డాలర్లు ఇంటర్నేషనల్ రుసుముగా చెల్లిస్తే, ఇంక, భవిష్యత్తులో ఆ సభ్యుడు ఇంటర్నేషనల్ రుసుము చెల్లించనవసరం లేదన్నమాట. వీరి జీవిత సభ్యత్వాన్ని క్లబ్ బోర్డు సభ్యుల సూచన మేరకు అంతర్జాతీయ బోర్డ్ డైరెక్టర్లు ఆమోదించవలసి వుంటుంది.

ఇంటర్నేషనల్ బకాయీల్ని జీవిత సభ్యులు ఒకేసారి చెల్లించినప్పటికీ, క్లబ్ నిర్ణయించిన రుసుముల్ని, డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ రుసుముల్ని ఏ ఏడాదికా ఏడాది చెల్లించడం మాత్రం జీవిత సభ్యులకు తప్పదు.

**6. ASSOCIATE MEMEBR:**

ప్రవాసం వచ్చిన ఒక సభ్యుడు తన సభ్యత్వాన్ని వేరే ప్రాంతంలో వేరొక లయన్స్ క్లబ్‌లో కలిగి వుంటూనే, ప్రస్తుతం తాను ఈ ప్రాంతంలో వుంటున్నాడు కాబట్టి ఇక్కడ పనిచేస్తున్న ఒక లయన్స్ క్లబ్‌లో అసోసియేట్ సభ్యుడిగా చేరవచ్చు. ఈ చేరిక కూడా, ఆ సంస్థ బోర్డ్ సభ్యులు ఆహ్వానించిన మీదటే జరగవలసి వుంది. ఈ ఆహ్వానాన్ని అవసరం అయితే సంవత్సరానికి ఒకసారి సమీక్షించవచ్చు కూడా.

క్లబ్ విషయాలలో యాక్టివ్ సభ్యుడిలానే ఓటు చేసే హక్కు, చర్చలలో పాల్గొంచుకునే హక్కు ఈయనకుంది. కాని, డిస్ట్రిక్ట్, ఆపైన స్థాయిలో పాల్గొనే అవకాశం లేదు. ఈ అసోసియేట్ సభ్యత్వాన్ని MM & A రిపోర్ట్‌లో తెలుపవలసిన అవసరం లేదు. కాబట్టి ఇంటర్నేషనల్‌కూ, డిస్ట్రిక్ట్స్‌కూ, మల్టిపుల్‌కూ ఎటువంటి ఫీజులూ చెల్లించనవసరం లేదు.

కానీ, క్లబ్ రుసుము ఏదైనా నిర్ణయిస్తే ఆ సభ్యుడు క్లబ్‌కు మాత్రం దాన్ని చెల్లించవలసి వుంటుంది. వలస వచ్చిన సభ్యుడు ట్రాన్స్‌ఫర్ పెట్టుకోకుండానే ఇలా మరో క్లబ్‌లో సభ్యుడు కావచ్చునన్నమాట!

**7. AFFILIATED MEMBER:**

1997 ఫిలడెల్ఫియాలో జరిగిన ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లో ఈ కొత్త సభ్యత్వాన్ని ప్రవేశపెట్టారు.

సమాజంలో ఉన్నత స్థానంలో వుండి, సేవా పరాయణత్వం కల్గినవ్యక్తి, పూర్తిస్థాయి సభ్యుడుగా లయనిజంలో చేరే అవకాశం లేకపోయినపుడు, క్లబ్ బోర్డ్ సభ్యులు ఆయన సేవల్ని లయనిజం కోసం వినియోగించుకోవడంకోసం ఆయన్ని ఎఫిలియేటెడ్ సభ్యుడిగా చేరమని కోరవచ్చు.

ఆయనకు క్లబ్ కార్యక్రమాల్లో పాల్గొనే హక్కు ఓటు వేసే హక్కు అన్నీ ఉంటాయి. కానీ, డిస్ట్రిక్ట్, మల్టిపుల్‌డిస్ట్రిక్ట్ సమావేశాలకు మాత్రం డెలిగేట్‌గా వెళ్ళకూడదు. క్లబ్‌తోసహా లయనిజంలో ఏ పదవినీ చేపట్టడానికి వీల్లేదు.

కానీ, లయన్స్ డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్, ఇంటర్నేషనల్ సభ్యత్వ బకాయిలు మాత్రం తప్పనిసరిగా చెల్లించవలసి వుంటుంది.

### లయనిజంలో క్లాసిఫికేషన్

ఇవికాక, సభ్యుల వృత్తులను పరిగణనలోకి తీసుకొంటూ "క్లాసిఫికేషన్" చేసి, ఒకే తరహా వృత్తిలో వున్నవారిని ఇద్దరికి మించకుండా తీసుకోవాలనే నియమం కూడా ఉంది. నిజానికి ఈ క్లాసిఫికేషన్ నియమాల్ని పాటిస్తే క్లబ్‌లో అన్నిరకాల వృత్తులవారూ ప్రవేశించేందుకు, మరింత సమర్థవంతంగా సేవాకార్యక్రమాలు చేసేందుకు అవకాశముంది. కానీ మనవాళ్ళు దీన్ని అంత సీరియస్‌గా తీసుకోవడం లేదు.

## ఒక క్లబ్‌లోంచి మరో క్లబ్‌లోకి ట్రాన్స్‌ఫర్ పెట్టుకోవచ్చు

## TRANSFER OF MEMBERSHIP

లయనిజంలో ఒక క్లబ్‌లో యాక్టివ్ సభ్యుడిగా వున్న వ్యక్తి ప్రపంచంలో ఎక్కడ ఏ దేశంలో ఏ లయన్స్ క్లబ్‌లోకయినా తన సభ్యత్వాన్ని ట్రాన్స్‌ఫర్ చేసుకోవచ్చు. ఒక ప్రాంతం నుంచి ఇంకో ప్రాంతంలోకి తరలి వెళ్తున్నప్పుడు ఈ "ట్రాన్స్‌ఫర్ ఆఫ్ మెంబర్‌షిప్" అనేది జరుగుతుంటుంది. 9 డాలర్ల ఫీజు చెల్లించి ట్రాన్స్‌ఫర్ పొందవచ్చు. సభ్యుని అభ్యర్థనమేరకు క్లబ్ సెక్రటరీగారు ఆ సభ్యుడి వివరాలు వ్రాస్తూ "ట్రాన్స్‌ఫర్ మెంబర్ ఫారం" పూర్తిచేసి ఇస్తాడు. దాన్ని తీసుకొని తాను చేరదలచిన క్లబ్ కార్యదర్శికి అందజేస్తారు. ఆ క్లబ్ బోర్డ్‌లో ఆ సభ్యుడిని చేర్చుకొనే విషయం నిర్ణయం తీసుకున్నాక,

ఆ కార్యదర్శి ఈయన అభ్యర్థనను అంగీకరిస్తున్నట్లు ఆ సభ్యుడికి వర్తమానం అందించడం జరుగుతుంది. అట్టి ట్రాన్స్‌ఫర్ సభ్యుడు క్లబ్ నిర్ణయించిన రుసుములు అన్నీ చెల్లించి, ట్రాన్స్‌ఫర్ పొందిన ఆరునెలలలోపు కొత్త క్లబ్‌లో సభ్యుడిగా చేరవచ్చు. ఈవిధంగా చేరిన సభ్యుడికి పాత సర్వీస్ రికార్డు కొనసాగుతుంది.

## క్లబ్‌కు భారమైన సభ్యుణ్ణి తొలగించే పద్ధతి
## HOW TO DROP A MEMBER

కొందరు సభ్యులు క్లబ్‌కు భారంగా తయారౌతారు. కార్యక్రమాలపట్ల ఆసక్తి చూపరు. సభ్యత్వ బకాయిలు చెల్లించరు. పిలిస్తే స్పందించరు. ఇంకొందరు లయనిజానికీ, క్లబ్‌లకి వ్యతిరేక ప్రచారం చేస్తుంటారు. ఇలాంటి వారిని ఎల్లకాలం క్లబ్‌లు భరించనవసరం లేదు.

★ మొదటగా బకాయిలు చెల్లించమని వ్రాతపూర్వకంగా నోటీసు ఇవ్వండి. అరవైరోజుల తర్వాత కూడా బకాయిలు చెల్లించనిపక్షంలో ఆ సభ్యుడు తన గుడ్ స్టాండింగ్ కోల్పోతాడు.

★ సభ్యుడి బకాయిల వివరాలను కార్యదర్శి బోర్డుకు తెలియజేస్తాడు. బోర్డ్ సభ్యులు అన్ని విషయాలూ పరిశీలించి, ఆ సభ్యుడి సభ్యత్వాన్ని తొలగించేందుకు అనుమతిస్తే, కార్యదర్శి ఆ నెల MM&A రిపోర్ట్‌లో అతన్ని డ్రాప్ చేస్తున్నట్లు చూపిస్తాడు.

★ క్లబ్‌లో ఆఫీసర్‌గా వున్న వ్యక్తినిగానీ, బోర్డ్ సభ్యుణ్ణిగానీ తొలగించాలంటే, జనరల్ బాడీ సంఖ్యలో మెజారిటీ సభ్యుల అనుమతి అవసరం అవుతుంది. ఆ వ్యక్తికి ముందుగా నోటీసిచ్చి, ఆయన సమాధానం పరిశీలించిన తర్వాత బోర్డ్ నిర్ణయం మేరకు సాధారణ సమావేశంలో ఆ సభ్యుడి తొలగింపు విషయమై స్పష్టంగా నోటీసుద్వారా తెలియజేసి చర్చించి నిర్ణయిస్తారు.

★ సాధారణ సభ్యుడిని డ్రాప్ చేయాలంటే, బోర్డ్ సభ్యుల్లో 2/3 వంతుల మంది అనుకూలంగా ఓటువేయవలసి ఉంటుంది.

★ వరుసగా నాలుగు సమావేశాలకు ఎటువంటి అనుమతి ముందుగా తీసుకోకుండా గైరు హాజరైన సభ్యుల వివరాల్ని బోర్డ్‌కు క్లబ్ సెక్రటరీ విధిగా తెలియజేయాలి. బోర్డ్ సభ్యులు అటెండెన్స్ కమిటీని కారణాలు పరిశీలించవలసిందిగా కోరతారు. ఆ కమిటీ రిపోర్ట్ ఆ సభ్యుడికి అనుకూలంగా లేనప్పుడు ఆయన్ని సభ్యుడిగా తొలగించే విషయం గురించి బోర్డ్ సభ్యులు చర్చించి తగిన నిర్ణయం తీసుకొంటారు.

★ కాబట్టి సకాలంలో రుసుములు చెల్లించడం మాత్రమేకాదు- లయనిజంలో క్లబ్‌పట్ల, క్లబ్ కార్యక్రమాలపట్ల విధేయత ఎంతో ముఖ్యం అనీ, తీరికచేసుకొని సాధ్యమైనన్ని ఎక్కువ కార్యక్రమాలకు హాజరయ్యేందుకు ప్రయత్నించాలనీ ప్రతి సభ్యుడూ గుర్తించడం అవసరం.

## సభ్యుడిగా రాజీనామా చేయదలిస్తే ఇదీ పద్ధతి
## RESIGNATIONS

క్లబ్‌లోంచి ఏ సభ్యుడికైనా రాజీనామా చేసే హక్కుంది. అయితే, ఆ రాజీనామాను బోర్డు సభ్యులు ఆమోదించవలసి వుంటుంది. ఆమోదించకపోవడం ఆ వ్యక్తి సేవలు క్లబ్‌కు కావాలని కోరడానికీ కావచ్చు. లేదా, ఆ వ్యక్తి చెల్లించవలసిన బకాయిలు ఏవైనా వుంటే వాటన్నింటినీ చెల్లించమని కోరడానికీ కావచ్చు.

రాజీనామా చేసిన సభ్యుడు తన దగ్గర వున్న లయన్స్ లేపెల్ పిన్‌తో సహా లయనిజానికి సంబంధించిన ప్రతిదీ తిరిగి క్లబ్‌కు ఇచ్చివేయవలసి వుంటుంది. ఆ తర్వాత ఆయన పేరుకుముందు లయన్ అని ఉపయోగించుకోవడానికి వీల్లేదు. ఆయన దగ్గర లయనిజానికి సంబంధించిన అవార్డులు వగైరా కూడా ఉంచుకోవడానికి వీల్లేదు.

## జారిపోయిన సభ్యులు పునఃప్రవేశం చేసే అవకాశం వుంది
## RE-INSTATION OF DROPPED MEMBERSHIP

అనేక కారణాల వలన కొందరు సభ్యుల్ని డ్రాప్ చేయడం జరుగుతుంది. వారిలో ఎవరైనా తిరిగి మనసు మార్చుకుని లయనిజంపట్ల, క్లబ్‌పట్ల, విధేయత కనపరచడానికి సంసిద్ధమైతే సభ్యత్వం నుండి విరమించిన ఆరునెలలలోగా వారిని "రీ ఇన్‌స్టేట్" చేయవచ్చు. అంటే పునఃప్రవేశం చేయవచ్చన్నమాట. అలా పునఃప్రవేశం చేసినవారికి వారి పూర్వపు సర్వీస్ రికార్డులన్నీ యధాతథంగా వుంటాయి. ఆ కాల పరిమితి దాటితే మళ్ళీ కొత్త సభ్యుడిగా అడ్మిషన్ కట్టి చేరవలసి ఉంటుంది. అంటే, పూర్వపు రికార్డు ఏదీ మిగలదన్నమాట!!

రీ-ఇనిస్టేషన్ ఫీ నిమిత్తం 9 డాలర్లనూ, దానితోపాటుగా క్లబ్ నిర్ణయించిన ఇతర రుసుముల్ని చెల్లించవలసి వుంటుంది.

## క్లబ్‌లో ఖాళీ అయిన పదవులకు మధ్యంతర ఎన్నికలు జరపవలసిందే!!

**MIDTERM POLL**

లయన్స్ క్లబ్‌లో అధ్యక్షపదవిగానీ, ఉపాధ్యక్షుల పదవులుగానీ ఏ కారణం చేతనయినా ఖాళీ అయి నప్పుడు ఇతర ఉపాధ్యక్షుల్లో ఒకరు ర్యాంక్ ప్రకారం ఆ ఖాళీ అయిన పదవిని స్వీకరిస్తారు. అధ్యక్షుడు స్థానంలో మొదటి ఉపాధ్యక్షుడుగానీ, ఆయనకు కుదరకపోతే రెండవ ఉపాధ్యక్ష్యుడుగానీ, ఆయనకూ అవకాశం లేకపోతే మూడవ ఉపాధ్యక్షుడుగానీ ఆపదవిని పొందేందుకు అర్హులౌతారు. ఈ ముగ్గురూ తమకు అవకాశం లేదని ప్రకటించినపుడు, రెండు వారాల వ్యవధిలో ప్రత్యేక ఎలెక్షన్ సమావేశం నోటీసిచ్చి బోర్డు అనుమతితో జనరల్ బాడీ సమావేశం ఏర్పాటుచేసి ఎన్నికలు జరపవలసి వుంటుంది.

అదే మూడవ ఉపాధ్యక్షుడి పదవికి ఖాళీ అయితే ఎన్నికలదాకా వెళ్ళనవసరం లేదు. బోర్డు సభ్యులే ఒకరిని ఆ పదవికి నామినేట్ చేయవచ్చు. లేదా దానిని ఖాళీగా వదలి వేయవచ్చు.

డైరక్టర్స్‌లో ఏదైనా ఖాళీ ఏర్పడి, కోరమ్ సమస్య ఏర్పడి, తప్పనిసరిగా ఎన్నిక జరపవలసి వస్తే ఏ రెగ్యులర్ సమావేశంలోనైనా ఎన్నిక జరిపి ఆ ఖాళీని భర్తీ చేయవచ్చు. అయితే ఎన్నిక జరగనున్న విషయాన్ని మాత్రం సమావేశం నోటీస్‌లో విధిగా పేర్కొనవలసి ఉంటుంది.

బోర్డులో అధ్యక్షులు, ముగ్గురు ఉపాధ్యక్ష్యులు, కార్యదర్శి, సహాయ కార్యదర్శి, కోశాధికారి, లయన్ టేమర్, టైల్ ట్విస్టర్ - ఈ తొమ్మిదిమందినీ క్లబ్ ఆఫీసర్లంటారు. ఈ క్లబ్ ఆఫీసర్లలో ఎవరైనా ఏ కారణం చేతనయినా తన పదవీ బాధ్యతలలోంచి విరమించుకున్నప్పుడు క్లబ్ అధ్యక్షుడు నామినేషన్ మరియు ఎలెక్షన్ సమావేశానికి రెండు వారాల వ్యవధిలో నోటీసిచ్చి ఆ పదవికి "మధ్యంతర ఎన్నికలు" జరుపుతాడు.

## సభ్యత్వాలు చెల్లించకపోతే క్లబ్ రద్దు

**STATUS QUO OF A LIONS CLUB & WITH DRAW OF THE CHARTER**

ఇంటర్నేషనల్, లయన్స్ డిస్ట్రిక్ట్‌కు, మల్టిపుల్ డిస్ట్రిక్ట్‌కు కట్టవలసిన సభ్యత్వ బకాయిల్ని చెల్లించకపోతే ఆ సంస్థ హక్కుల్ని, దాని కార్యకలాపాల్నీ తాత్కాలికంగా స్తంభింపచేయడాన్ని "స్టేటస్ కో"లో ఉంచడం అంటారు.

ఆరుమాసాలపాటు ఏ సమావేశం, ఏ కార్యక్రమం జరగకుండా నిస్తేజంగా వుండి, నెలనెలా పంపే MM&A రిపోర్ట్‌లు పంపకుండా ఆగిపోయినప్పుడు జోన్ ఛైర్మన్, రీజియన్ ఛైర్మన్‌ల సలహా మేరకు జిల్లా గవర్నర్‌గారు ఆ క్లబ్‌ని "స్టేటస్ కో" లో పెట్టమని ఇంటర్నేషనల్‌కు రికమండ్ చేయవచ్చు.

పై కారణాలేకాకుండా, లయన్స్ ప్రవర్తనా నియమావళికీ లయనిజం లక్ష్యాలకు విరుద్ధంగా పెడధోరణుల్లో క్లబ్ నడుస్తునప్పుడు (Conduct Un Becoming A Lions Club) కూడా ఆ క్లబ్‌ని స్టేటస్‌కోలో వుంచవచ్చు.

స్టేటస్ కోలో పడిన ఆ క్లబ్‌కు ప్రాణ ప్రతిష్ట చేయగల్గిన వ్యక్తి ఎవరైనా ముందుకు వస్తే ఆయనను "రీ బిల్డింగ్ లయన్"గా జిల్లా గవర్నర్‌గారు నియమిస్తారు. స్టేటస్ కో రికమెండ్ చేసిన 90 రోజుల్లోగా ఆ క్లబ్‌చేత సభ్యత్వ బకాయిలు చెల్లింపచేస్తే "స్టేటస్ కో"ని తొలగిస్తారు. కానీ, ఆ బకాయిలతోపాటు ఆ సభ్యుల్లో మిగిలివున్నవారు తలా ఒక 5 డాలర్లు చొప్పున ఇందు నిమిత్తం ఫీజుగా చెల్లించవలసి వుంటుంది.

స్టేటస్‌కో కాలంలో మాత్రం ఆ క్లబ్‌కు దామాషా ఇంటర్నేషనల్ రుసుములు (Prorata of Inter National Dues) చెల్లించనవసరం లేదు.

## నెలవారీ సభ్యత్వ, సేవా కార్యక్రమాల నివేదిక

**MONTHLY MEMBERSHIP & ACTIVITIES REPORT (M.M. & A REPORT)**

★ MM&A రిపోర్టు అనేది కేవలం మీ క్లబ్‌లో ఏ నెలకానెల ఎంతమంది సభ్యులున్నారో తెలిపే చిట్టా మాత్రమే కాదు - అది మీ సేవా కార్యక్రమాల ఘనతను పదికాలాలపాటు పదిలపరిచే మీ క్లబ్ చరిత్ర. ఆ చరిత్రను సృష్టిస్తోంది మీరే..... ఆ చరిత్రను రాస్తోందీ మీరే!!

★ ప్రతినెలా ఈ రిపోర్ట్‌ని ఎటువంటి పొరబాట్లూ, తప్పులూ లేకుండా పూర్తిచేసి ఇంటర్నేషనల్ ఆఫీస్‌కు (ముంబాయి ఆఫీస్) డిస్ట్రిక్ట్ కార్యాలయానికి, రీజియన్ ఛైర్మన్‌కు, జోన్ ఛైర్మన్‌కూ ఎవరి కాపీ వారికి పంపాలి.

★ ముఖ్యంగా క్లబ్ సభ్యుల సంఖ్యని జాగ్రత్తగా ఎలాంటి కొట్టివేతలు లేకుండా టైప్ చేయడం మంచిది!

★ వచ్చే నెల 10వ తేదీలోగా ఈ నెల రిపోర్ట్ ఇంటర్నేషనల్ ఆఫీస్‌కు (ముంబాయి ఆఫీస్) చేరాలి. 5వ తేదీలోగా డిస్ట్రిక్ట్ ఆఫీస్‌కు చేరాలి.

★ కొత్త సభ్యుణ్ణి రిపోర్ట్ చేసేప్పుడు ఆ సభ్యుణ్ణి స్పాన్సర్ చేస్తున్న లయన్ పేరూ, ఆయన సభ్యత్వ సంఖ్య కూడా వెయ్యాలి.

★ ఓ సభ్యుణ్ణి డ్రాప్ చేసేప్పుడు, ఇంటర్నేషనల్ రికార్డ్సులో అతనిపేరు సరిగ్గా ఎలా రికార్డు అయ్యిందో అలాగే టైప్ చెయ్యండి. పొడి అక్షరాల్లో రాయడమో, స్పెల్లింగ్ తేడా రాయడమో జరిగితే డ్రాపింగ్ జరగకుండా బిల్లు పంపించే ప్రమాదం లేకపోలేదు.

★ ఈ రిపోర్టు ఆధారంగానే ప్రతినెలా బిల్లులు తయారుచేసి ఇంటర్నేషనల్ ఆఫీసు నుంచి నేరుగా క్లబ్‌లకు పంపడం జరుగుతుంది. సాధారణంగా ఇంటర్నేషనల్ బిల్లులో తప్పుదొర్లదు. తేడా ఏదైనా కన్పించిందంటే, మీ రిపోర్టింగ్ లోనే పొరబాటు జరిగి వుంటుందేమో ముందుగా వెరిఫై చేసుకోండి!

★ క్లబ్ చరిత్రని, ఫోటోలతో సహా ఎప్పటికప్పుడు ఇంటర్నేషనల్‌కు పంపితే, వారు మన MM&A రిపోర్ట్‌ని తేదీవేసి అసోసియేషన్ రికార్డ్ సెక్షన్‌కు పంపుతారు. అక్కడ అవి కంప్యూటర్లలో రికార్డు అవుతాయి. ఏ సంవత్సరంలో మీ క్లబ్ చరిత్ర కావాలని మీరు కోరినా వెంటనే మీకు పంపించగలదు ఇంటర్నేషనల్!

## క్లబ్ ఆఫీసర్ల బాధ్యతలు

## DUTIES & RESPONSIBILITIES OF CLUB OFFICE BEARERS

### క్లబ్ అధ్యక్షుడు

**లయన్స్** క్లబ్ అధ్యక్షుడు తన సంస్థకు చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వ్యవహరిస్తాడు. క్లబ్ సమావేశాలన్నింటికీ ఆయనే అధ్యక్షత వహిస్తాడు. వివిధ కమిటీల్నీ అలాగే క్లబ్ ఎలెక్షన్లకు పిలుపునిస్తూ నామినేషన్ కమిటీనీ నియమిస్తాడు. జోన్ ఛైర్మన్ గారి "గవర్నర్స్ అడ్వయిజరీ కమిటీ"లో యాక్టివ్ సభ్యుడుగా వుంటాడు.

### క్లబ్ వైస్ ప్రెసిడెంట్స్

అధ్యక్షుడికి క్లబ్ పాలనలో సహకరించడం, ఆయన లేనప్పుడు ర్యాంక్ ప్రకారం ఆయన స్థానంలో ఆయన విధుల్ని నిర్వహించడం వీరి విధి. అధ్యక్షుడు నియమించిన కమిటీలను 3 భాగాలుగా విభజిస్తారు. అడ్మినిస్ట్రేటివ్ కమిటీలను మొదటి వైస్ ప్రెసిడెంట్‌కూ, సేవా కార్యక్రమాల కమిటీలను రెండు, మూడు వైస్ ప్రెసిడెంట్లకూ పర్యవేక్షక బాధ్యత అప్పగిస్తారు. తమ పర్యవేక్షణలోని వివిధ కమిటీలు సక్రమంగా పనిచేసేలా చూడడం, వాటి నిర్ణయాలను బోర్డ్‌కు తెలియజేయడం వీరి బాధ్యతలు.

### క్లబ్ కార్యదర్శి

లయన్స్ క్లబ్‌కీ, లయన్స్ డిస్ట్రిక్ట్‌కీ అనుసంధాన అధికారి (Liaison Officer) ఈయన. క్లబ్ అధ్యక్షుడు, మరియు బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల అజమాయిషిలో ఈయన పనిచేస్తారు. నెలనెలా MM&A రిపోర్ట్‌లు పంపడం, సభ్యత్వ బకాయిల వివరాల్ని బోర్డ్‌కు అందజేయడం, క్లబ్ రికార్డ్స్ సభ్యుల రికార్డ్స్ సక్రమంగా నిర్వహించడం, బిల్లులు తయారుచేయడం, రుసుములు వసూలు చేయడం అక్కౌంట్లకు సంబంధించిన స్టేట్‌మెంట్స్ తయారుచేయడం వంటి బాధ్యతలు నిర్వహిస్తారు. అర్హతలు పొందిన క్లబ్ సభ్యులకు ఇంటర్నేషనల్ నుంచి వచ్చే అవార్డుల కోసం అప్లై చేయడం, క్లబ్ అక్కౌంట్ల

స్టేట్‌మెంట్స్ తయారుచేయడం - వంటివి ఈయన బాధ్యతలు. జోన్ ఛైర్మన్‌గారి గవర్నర్స్ అడ్వయిజరీ కమిటీలో ఈయన కూడా సభ్యుడే.

## క్లబ్ కోశాధికారి

క్లబ్ ఆర్థిక శాఖకు ఈయన అధికారి. వసూళ్ళను బ్యాంక్‌లో జమచేయడం, ఖర్చులన్నీ తన నేతృత్వంలోనే జరిగేలా చూసుకోవడం ఫైనాన్షియల్ రిపోర్ట్‌ని ఎప్పటికప్పుడు బోర్డ్‌కు అందచేయడం వంటి ఆర్థికపరమైన విధుల్ని నిర్వహిస్తాడు. గవర్నర్స్ అడ్వయిజరీ కమిటీలో సభ్యుడుగా ఉంటారు.

## టెయిల్ ట్విస్టర్

ఈ పదవి క్లబ్ స్థాయిలోనే వుంటుంది. సంస్థలో సుహృద్భావ వాతావరణాన్ని నెలకొల్పడం వీరి కర్తవ్యం. మంచి "ఫెల్లోషిప్" పెరిగేలా చూడాలి. సమావేశాలు రక్తి కట్టేలా ప్రవర్తించాలి.

సభ్యుల లోటుపాట్లతోపాటు, వారి వ్యక్తిగత విజయాల్ని కూడా సున్నితమైన హాస్యంతో మేళవిస్తూ సభారంజకంగా సభ్యులకు తెలియజేయడం వంటి టెయిల్ ట్విస్టర్ కార్యక్రమాలు చూడడానికి చాలా బావుంటాయి.

టెయిల్ ట్విస్టర్‌గారు ఫైన్‌లు వేయడం ద్వారా వసూలు చేసిన సొమ్మును క్లబ్ అడ్మినిస్ట్రేటివ్ అక్కౌంట్‌లో జమచేస్తారు.

## లయన్ టేమర్

ఈ పదవి కూడా క్లబ్‌స్థాయిలోనే వుంటుంది. క్లబ్ ఆస్థికి ఈయన సంరక్షుడంటారు. క్లబ్ ఆస్థులంటే - క్లబ్ బ్యానర్, క్లబ్ అటెండెన్స్ రిజిస్టర్, మినిట్స్ పుస్తకాలు, గ్యాంగ్, గ్యావెల్, ప్రేయర్, ఫ్లాగ్ శాల్యుటేషన్........... వగైరా....... వగైరా.......... అంతే!

అయితే సమావేశాలకు అందరికన్నా ముందుగా వచ్చి ఎక్కడ వుండవలసిన వస్తువుల్ని అక్కడ వుంచడం, అందరికన్నా ఆఖరున వాటిని జాగ్రత్తగా తీసుకువెళ్ళడం...... ఇవన్నీ ఈయనే చేయాలి. దండనాధుడు (Sergeant at Arms) లాగా ఈయన క్లబ్ సమావేశాలలో వ్యవహరిస్తారు.

## బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్

క్లబ్ కార్యక్రమాల మీద పూర్తి అజమాయిషీ బోర్డ్‌దే. బోర్డ్‌లో సభ్యులు విధిగా బోర్డ్ సమావేశాలకు హాజరై నోరువిప్పి తమ అభిప్రాయాలు స్పష్టంగా చెప్పి నిర్ణయాలలో అందరూ భాగస్వామ్యం వహించాలి.

క్లబ్ కార్యక్రమాలను నిర్ణయించడంతోపాటు సమాజంలోంచి కొత్త సభ్యుల్ని గుర్తించడం, ప్రతిపాదించడం వీరు చేయవలసిన పనులలో ముఖ్యమైనవి.

బోర్డ్ అనుమతి లేనిదే క్లబ్‌లో ఏమీ జరగడానికి వీల్లేదు.

## క్లబ్ అధ్యక్షుడు - ఏడాది పాలన

## DUTIES OF CLUB PRESIDENT

ఈ ఏడాది మీరు క్లబ్ అధ్యక్షులా....? కంగ్రాచ్యులేషన్స్. ఇది మీ పాలనా సంవత్సరం. జీవితంలో పెళ్ళయిన సంవత్సరం, ఉద్యోగం వచ్చిన సంవత్సరం..... ఇలా మరిచిపోలేని సంవత్సరాలు మీకు ఎన్నో వుంటాయి. క్లబ్ అధ్యక్షుడిగా మీ పాలనాకాలం మీకు అలాంటిదే. మరపురాని అనుభూతులతో సంతృప్తికరమైన సేవాభాగ్యం పొందిన సంవత్సరంగా దాన్ని మీరు మలుచుకోగలగాలి.

ఒకవైపు నుంచి క్లబ్ పరిపాలన, ఇంకొక వైపు నుంచి క్లబ్ సేవా కార్యక్రమాలు మీ నించి ఎంతో సమర్థతని ఆశిస్తుంటాయి. మీరు అందుకు తగ్గట్టుగా దృఢంగా నిలబడగలగాలి. జూలై 1 నుంచి, జూన్ 30 వరకూ మీ పదవీకాలం ఒక లయనిస్టిక్ సంవత్సరం.

**ప్రమాణ స్వీకారానికి ముందుగా............**

★ మీకు ముందు క్లబ్ అధ్యక్షుడిగా పనిచేసిన లయన్ సభ్యుడి సలహాలు పొందండి.

★ మీ ప్రమాణస్వీకారోత్సవం నాడు మీ సంస్థ సభ్యులందరూ విధిగా హాజరయ్యేలా చూడండి.

★ క్లబ్‌లో ఏ సభ్యుడితోనయినా అభిప్రాయభేదాలుంటే ఒక అడుగు మీరే దిగి వచ్చి వాటిని పరిష్కరించుకోండి. సభ్యులందరి సహకారం మీకు దొరికేలా ప్లాన్ చేసుకోండి.

★ చేపట్టవలసిన కార్యక్రమాల గురించి బోర్డులో చర్చించండి. చాలా క్లబ్‌లు పదవీవిరమణ చేస్తున్న చివరి బోర్డ్ సమావేశంలో అధికారంలోకి రాబోయే బోర్డ్ సభ్యుల్ని కూడా పిలిచి సంయుక్త సమావేశాన్ని (Joint Board Meeting) నిర్వహించే సాంప్రదాయాన్ని పాటిస్తాయి. ఆ సమావేశంలో అందరి సలహాలూ తీసుకొంటూ, కొత్తగా తాము చేపట్టవలసిన కార్యక్రమాలనూ, అసంపూర్తి కార్యక్రమాలనూ, నిరంతరం కొనసాగే కార్యక్రమాలనూ రూపకల్పన చేసుకోండి.

★ రూపకల్పన చేసుకున్న కార్యక్రమాలకు తగ్గట్టుగా సంస్థ సభ్యుల్లోంచి అనువైన వ్యక్తులకు వివిధ కమిటీల బాధ్యతలు అప్పగించండి. ప్రమాణస్వీకారోత్సవం నాటికి వారి వారి డ్యూటీల పత్రాలు వారికి అందించండి.

## ప్రమాణ స్వీకారం చేశాక.............

★ క్లబ్ అధ్యక్షుడిగా మీకంటూ ఒక దృష్టి (Vision) వుండాలి. ఆ దృష్టిలోంచే మీరు చేపట్టవలసిన కార్యక్రమాలను పరిశీలించవలసి వుంటుంది. మీ ప్లాన్‌లన్నింటినీ క్లబ్‌లో ముఖ్యులతో చర్చించి వాటిని మెరుగుపరుచుకోండి. సభ్యులందరూ క్లబ్ కార్యక్రమాలలో నిమగ్నులయ్యేలాగా ప్రోత్సహించండి.

★ మొదటి ఆరునెలలకు గానీ, పూర్తి సంవత్సరానికి గాను సరిపడ బడ్జెట్‌ను ఫైనాన్స్ కమిటీ చేత తయారుచేయించి బోర్డ్ సమావేశంలో ప్రవేశపెట్టి నిర్ణయం తీసుకొనేలా చూడండి. ఇదంతా ప్రమాణస్వీకారం అయిన ఒకట్రెండు నెలలలోపే జరిగిపోవాలి.

★ మీ ప్రతిపాదిత కార్యక్రమాల నిర్వహణకోసం మీకో చక్కటి ప్రణాళిక కావాలి. క్లబ్ పనులు, స్వంత పనులూ - వేటి వేటికి ఎప్పుడెప్పుడు ఎంతెంత సమయం కేటాయించాలి..... అనే ముందుచూపుతో బాగా ఆలోచించి, సంవత్సర కాలానికి సరిపడ ప్లానింగ్ చేసుకోండి. తేదీలు ఫిక్స్ చేసుకోండి.

★ సేవా కార్యక్రమాలకోసం డాక్టర్లు, ఇతర ప్రముఖుల నుంచి ఏడాది మొత్తానికీ - ముందుగానే ఫిక్స్ చేసుకున్న తేదీల ప్రకారం "అనుమతి" తీసుకోండి. డాక్టర్లు, ప్రముఖులు ముందుగానే మనకు "డేట్స్" ఇచ్చేశారు కాబట్టి ఆయా తేదీల్లో వారు ఇంకో పనిపెట్టుకోకుండా వుంటారు. మనం కూడా బాధ్యతగా ఖచ్చితంగా ఆ కార్యక్రమాన్ని చేయగల్గుతాం. దీన్నే Time Bound Planning అంటారు. ఇది అధ్యక్షులకు ఎంతగానో అవసరం.

★ నెలనెలా క్లబ్ ఆర్థిక పరిస్థితిని బోర్డ్‌కు సమర్పించేందుకు సెక్రటరీ, ట్రెజరర్‌లను గట్టిగా ప్రోత్సహించండి.

★ ప్రతి 3 నెలలకు ఒకసారి క్లబ్ ఆర్థిక విషయాల గురించిన స్టేట్‌మెంట్‌ను సాధారణ సభ్యులకు పంపాలి. ఆరునెలల కొకసారి ఇంటర్నేషనల్‌కు పంపాలి. సంవత్సరాంతంలో ఆడిట్ చేయించిన అక్కౌంట్స్ అందరికి పంపాలి.

★ సమాజానికి తక్షణ అవసరాలు, దీర్ఘకాలిక అవసరాలూ వేర్వేరుగా వుంటాయి. ఏ కార్యక్రమం చేపడితే ఎక్కువ మంది లబ్ధిదారులు వుంటారని మీకు గట్టిగా నమ్మకంగా అన్పిస్తుందో ఆ కార్యక్రమాలే చేపట్టండి.

★ సమాజానికి అవసరమైన కార్యక్రమాలూ, సమాజం మెచ్చే కార్యక్రమాలూ చేపడితే లయనిజం ప్రతిష్ట పెరగడమే కాకుండా సమాజ సహకారం, ప్రోత్సాహం బాగా లభిస్తాయి. సమాజంలోని ఇతర సేవాతత్పరులు మన సంస్థపట్ల ఆకర్షితులౌతారు. వారిని గుర్తించి మన సంస్థలో చేర్చవచ్చు కూడా. అన్నింటికీ మించి ఎక్కువ సేవాభాగ్యం పొందిన సంతృప్తి మీకు లభిస్తుంది.

## సమావేశాలు నిర్వహించేటప్పుడు...............

విజయవంతంగా సమావేశాన్ని నిర్వహించడానికి కొన్ని ముఖ్య సూత్రాలున్నాయి.

★ బాగా ప్రిపేర్ అవ్వండి జరగబోయే సమావేశంలో ప్రతి విషయం మీద మీకు మంచి ప్రవేశం వున్నప్పుడు మీరు బాగా నిర్వహించగల్గుతారు.

★ సమావేశంలో, ముఖ్యంగా బోర్డ్ సమావేశంలో ఎవరెవరు ఏం మాట్లాడతారో ముందుగా ఊహించండి. ఏ ఏ విషయాల మీద ఎవరి అభిప్రాయాలు ఎలా వుంటాయో వారితో వ్యక్తిగతంగా మాట్లాడడం ద్వారా, సమావేశానికన్నా ముందే అభిప్రాయసేకరణ జరిపి - మెజారిటీ సభ్యుల అభిప్రాయాలకు అనుగుణమైన కార్యక్రమాలను బోర్డులో ప్రవేశపెడితే అనవసర చర్చలు, వాడి వాదాలు వేడి వ్యాఖ్యానాలకు అవకాశం వుండదు. మీరు హాయిగా ఊపిరి పీల్చుకోగలుగుతారు.

★ లయన్స్ రాజ్యాంగం పట్ల, విధి విధానాల పట్ల, పార్లమెంటరీ సాంప్రదాయాల పట్ల సరి అయిన అవగాహన కల్గిన వ్యక్తి సమావేశాల్ని చక్కగా రక్తి కట్టించగల్గుతాడు. అలాంటివి ఏమీ పట్టించుకోని వ్యక్తులు రసాభాసకు స్వయంగా కారకులౌతారు కూడా!!

★ మీ నాయకత్వాన్ని, మీ అధికారాన్ని ప్రశ్నించే పరిస్థితులు ఎదురైనప్పుడు మీ చేతిలో అధికారదండం (గ్యావెల్) అవసరం అవుతుంది. పరిస్థితులు మీ చేయి దాటుతున్నప్పుడు దాని ఉపయోగం తెలుస్తుంది. ఈ గ్యావెల్‌ని మీకు బహూకరించేప్పుడు మీ ఇన్‌స్టలేషన్ ఆఫీసర్‌గారు దీన్ని చాలా జాగ్రత్తగా ఉపయోగించమని చెప్తారు. అంటే, దుర్వినియోగం చేయవద్దని మాత్రమేకాదు, అవసరమైనప్పుడు ఉపయోగించమని కూడా!

★ ఇబ్బందికరమైన వ్యాఖ్యానాలు ఎదురైనప్పుడు వాటిని ఒక చర్చనీయాంశం (Motion) గా ప్రతిపాదించమని కోరండి. అప్పుడు ఆ వ్యాఖ్యానాలను మెజారిటీ సభ్యులు ఓటింగ్‌ద్వారా తిరస్కరించేందుకు అవకాశం వస్తుంది. భవిష్యత్తులో అలాంటి అనవసర వ్యాఖ్యానాలు రాకుండా ఆగుతాయి.

★ చర్చల సమయంలో అదుపు చేయడానికి వీలులేకుండా గందరగోళం ఏర్పడిందనుకోండి - మినిట్స్‌లో రికార్డుచేసే నిమిత్తం ఒక్కొక్కరినీ వారి పేరు చెప్పి, వారి వ్యాఖ్యానాలను స్పష్టంగా చెప్పమని, రికార్డ్ చేస్తామని ప్రకటించండి. క్లబ్ చరిత్రలో అనవసర వ్యాఖ్యానాలు చేసిన వ్యక్తిగా రికార్డులలో కెక్కడం ఇష్టం లేని చాలామంది తమ వ్యాఖ్యానాలను ఉపసంహరించుకొని మీకు సహకరించేందుకు అవకాశం వుంది.

★ అప్పటికీ అలజడి సర్దుమణగకపోతే ఓటింగ్‌కు పెట్టవలసి వస్తుంది. ఓటింగ్‌లో మెజారిటీ సభ్యులే ఆ విషయాన్ని తేల్చేస్తారు. మీ బాధ్యత ప్రత్యేకంగా ఏదీ

వుండదు. ఓటింగ్ పెట్టాలా - వాయిదా వేయాలా - ఉపసంహరించుకోవాలా.. అనే నిర్ణయాన్ని బోర్డుకే వదిలేయండి!

★ వ్యక్తిగతమైన ఆరోపణలు ఏవైనా వచ్చి అలజడి ఏర్పడినప్పుడు మాత్రం మీరు సహనంతో సర్దుబాటు చేయడానికి ప్రయత్నించండి.

★ ప్రత్యేక గుర్తింపుకోసం ఏదోకటి మాట్లాడాలని మాటిమాటికి ప్రయత్నించే వారు ఎప్పటికైనా ప్రమాదకరమే. అత్యుత్సాహంతో అవసరం వున్నవీ లేనివీ అన్నీ మాట్లాడేస్తుంటారు. అలాంటివారికి అవకాశం ఇవ్వబోయే ముందు వారు ఏ విషయమై ఏం మాట్లాడబోతున్నారో ముందుగా అడిగి తెలుసుకొని అప్పుడు మాట్లాడేందుకు అవకాశం ఇవ్వండి.

★ అధ్యక్షుని అనుమతి లేనిదే ఎవ్వరూ మాట్లాడకూడదు. సభాసదులు ఈ విషయాన్ని గుర్తెరిగేలా మీరు పార్లమెంటరీ సాంప్రదాయాలను మీ సభ్యులకు తెలియజేయండి. అవసరం అయితే రూలింగ్ ఇవ్వండి. ఆ రూలింగ్ ఇచ్చే మీ అధికారానికి చిహ్నామే మీ చేతిలో వున్న గ్యావెల్!!

★ బోర్డు సమావేశాలు మీ ఇంట్లోగానీ, మీ సభ్యుల ఇళ్ళలోగానీ జరిపేందుకు ఎక్కువగా ప్రయత్నించండి. అందువలన సభ్యులతో సాన్నిహిత్యం పెరుగుతుంది. ఉద్రేకపూరితమైన వాతావరణం ఇళ్ళలో జరిగే మీటింగ్‌ల్లో పెద్దగా వుండదు. ప్రశాంతంగా సమావేశం జరిగిపోతుంది.

★ అతిగా ప్రవర్తించే వారికన్నా, నిర్లిప్తంగా ప్రేక్షకుడిగా మౌనంవహించే సభ్యుల విషయంలో మనం మరింత జాగ్రత్తగా వ్యవహరించాలి. వారిని చర్చనీయాంశాలపై ప్రత్యేకంగా ప్రశ్నించి, వారి మనసులోంచి అభిప్రాయాల్ని రాబట్టి వారిని కూడా నిర్ణయాలలో భాగస్వాములు చేయండి.

## లయన్స్ క్లబ్ సమావేశాలు

### CLUB MEETINGS - PROCEDURES

★ ప్రతినెలా కనీసం రెండు రెగ్యులర్ సమావేశాలు, ఒక బోర్డ్ సమావేశం జరగాలని లయనిజం నిర్దేశిస్తోంది.

★ సమావేశాలన్ని ఖర్చుతో కూడుకున్నవిగానూ, హోటల్స్‌లోనూ కాన్ఫరెన్స్ హాల్స్‌లోనూ జరిగి తీరాలనే నియమం ఏదీలేదు. సభ్యుల ఇళ్ళలోగానీ, వారికి అనుకూలమైన చోటులో గానీ ఎక్కడైనా జరుపుకోవచ్చు.

★ క్లబ్ పాలనాపరమైన ఎలెక్షన్లు, బడ్జెట్ వంటి విషయాలకు సంబంధించిన సమావేశాలకు తప్ప తక్కిన అన్ని రెగ్యులర్ సమావేశాలకు అందరూ ఆహ్వానితులే. "గెస్ట్ ఆర్ మోస్ట్ వెల్‌కం" అని రాస్తుంటాం మనం.

★ కోరమ్ అవసరమైన సమావేశాలలో ప్రత్యేకంగా రాజ్యాంగంలో చెప్పనిచోట - మెజారిటీ సభ్యులు (సగంకన్న ఎక్కువమంది) హాజరైతే కోరమ్ సరిపోతుంది.

★ ఏ ఐదుగురు సభ్యులు ప్రత్యేక సమావేశం ఏర్పాటు చేయమని కోరినా, విధిగా ఏర్పాటు చేయవలసి వుంటుంది.

**సభా నిర్వహణ - క్లబ్ ప్రెసిడెంట్‌గారు**

సభానిర్వహణ కత్తిమీద సాము లాంటిది. "సుత్తి" కొట్టకుండా సభను రంజింపచేస్తూ హుందాగా నడిపించి "శెహభాష్" అనిపించుకోగల అధ్యక్షులుంటే సమావేశాలకు సభ్యుల అటెండెన్స్ పెరుగుతుంది.

1. సమయపాలన చెయ్యండి. 2. మీటింగ్‌లకు చాలా ఇంటరెస్టింగ్ సబ్జెక్ట్‌ల్ని ఎంచుకొని, చక్కటి ఉపన్యాసాలు వచ్చేలా చూడండి. 3. టైముకు మొదలు పెట్టి, టైముకు ముగించేలా పథకం చేసుకోండి. 4. సమావేశాలకు రావడం తమ బాధ్యతగా సభ్యులు గుర్తించేలా చేయండి. 5. క్లబ్‌లో కొందరు పనిచేసేవారు, కొందరు ఊరక చూసేవారు, కొందరు ఏమీ పట్టనివారు - ఇలా మూడు వర్గాల మనుషులు లేకుండా, అందరూ కార్యక్రమాలలో పూర్తిగా నిమగ్నమయ్యేలా ప్రోత్సహించండి. 6. సమావేశాలకు ముందుగానీ తర్వాత గానీ ఏర్పరచే విందు రుచికరంగా వుండేలా చూడండి. 7. తరచూ సమావేశాలకు గైరుహాజరయ్యే సభ్యులను ప్రత్యేకంగా ఆహ్వానించి వారికి ఏవైనా బాధ్యతలు అప్పగించండి. 8. ఆయనకు రావడానికి వుండే ఇబ్బందులు ఏమిటో స్వయంగా తెలుసుకోవడానికి ప్రయత్నం చెయ్యండి. 9. ఎక్కువమందికి అనుకూలమైన సమయాలలో మాత్రమే సమావేశాలు నిర్వహించండి. 10. సాధ్యమైనంతవరకూ వ్యక్తిగతంగా సభ్యుల్ని ఆహ్వానించి ఎక్కువమంది పాల్గొనేలా చూడండి. అందుకు క్లబ్‌లోని ఇతర సభ్యుల సహకారం కూడా తీసుకోండి.

**సెక్రటరీగారు - బోర్డ్ సమావేశాలు**

1. ప్రెసిడెంట్‌గారి కోరిక మేరకు బోర్డ్ సమావేశాన్ని పిలవడం
2. చర్చనీయాంశాన్ని అధ్యక్షుడితో చర్చించి రూపొందించడం
3. వివిధ కమిటీల ఛైర్మన్లను (అవసరాన్నిబట్టి) బోర్డు సమావేశానికి ఆహ్వానించడం
4. వారి నివేదిక బోర్డుకు సమర్పించడం
5. సమావేశం జరుగుతున్నప్పుడు మినిట్స్ రికార్డు చేయడం
6. సమావేశం అయిన తర్వాత మినిట్స్ కాపీని బోర్డ్ సభ్యులకు పంపించడం
7. తదుపరి సమావేశంలో ఈ మినిట్స్ కాపీని చదివి బోర్డ్ అప్రూవల్ పొందడం

ఇవి మౌలికంగా బోర్డు సమావేశాలకు సంబంధించి సెక్రటరీగారి డ్యూటీలు

**సెక్రటరీగారు రెగ్యులర్ సమావేశాలు**

సభ రెగ్యులర్ సమావేశాలు అన్ని క్లబ్‌లవీ ఒకేలా జరగవు. సభ నాయకత్వాన్ని బట్టి కూడా సమావేశాల స్టైల్ మారిపోతుంటుంది.

ఏవి ఎలా జరిగినా మంచి స్నేహ పూరిత వాతావరణంలో సమావేశాలు హుందాగా జరగడమే కావలసింది.

**A) సమావేశానికి ముందే ఏర్పాట్లన్నీ సరి చూసుకోవాల్సింది సెక్రటరీగారే!**

- ★ గ్యాంగ్ & గ్యావెల్ తెచ్చారా?
- ★ ప్రార్థన, జండావందనాలు చదవడానికి రెడీగా ఉన్నాయా?
- ★ అవార్డులు, మెమెంటోలు వచ్చాయా?
- ★ ఎవరెవరికి ఏఏ బాధ్యతలు అప్పగించామో వారు సమయానికి వచ్చారా......... లేదా....?

  ఉదాహరణకు ప్రేయర్ చేయమని ముందుగా ఒక సభ్యుణ్ణి కోరారు. ఆయన ఆ సమయానికి రాలేదు అనుకోండి.... ఏంచెయ్యాలి.....? ప్రత్యామ్నాయ ఏర్పాట్లన్నీ మీటింగ్‌కు ముందే సెక్రటరీగారు చూసుకోవాలి.

- ★ కార్యక్రమం ఎజెండా తయారు చేసి అధ్యక్షుడికి అందుబాటులో ఉంచాలి ఎటెండెన్స్ పుస్తకంలో సభ్యుల సంతకాలు తీసుకోవాలి.

**B) సమావేశం ప్రారంభం అయిన తర్వాత సెక్రటరిగారు చేయవలసింది**

- ★ సభ్యులు ఎంతమంది వచ్చారు? గెస్ట్ ఎంతమంది వచ్చారు.....? చూసుకోవాలి.
- ★ సెక్రటరీ రిపోర్ట్ రెగ్యులర్ సమావేశాలలో సమర్పించేందుకు అవసరమైన వివరాలతో చక్కగా ప్రిపేర్ అయివచ్చి సమర్పించాలి.
- ★ విజిటింగ్ లయన్స్, నాన్‌లయన్స్ లిస్ట్ తయారు చేసుకొని వారిని గుర్తించడం
- ★ మినిట్స్ నోట్ చేసుకోండి. ఒక పత్రికా విలేకరి ఉపన్యాసాన్ని ఎలా నోట్ చేసుకొని, దానిలో సారాన్ని తీసి ఒక వార్తగా ఎలా రాస్తాడో, అలాగే ఒక విషయం మీద చర్చ జరిగినప్పుడు చర్చల సారాంశాన్ని నోట్ చేసుకొని, తీర్మానాన్ని తయారు చేయాలి. అవసరం అయితే దాన్ని చదివి వినిపించి సభ్యుల ఆమోదాన్ని పొందాలి.

**C) సమావేశం ముగిసిన తర్వాత సెక్రటరీగారి డ్యూటీలు**

- ★ ఆ సమావేశం అందరూ తలా కొంత చందాలు వేసుకొని ఏర్పాటు చేసుకొన్న డిన్నర్ సమావేశం అయితే వెంటనే అక్కడికక్కడ ఆ ఛార్జీలు సభ్యుల నుంచి వసూలు చేయాలి.
- ★ ఏ సభ్యులు ఎంతెంత లెవీకట్టారో అక్కడికక్కడే నోట్ చేయాలి. సెక్రటరీ కిట్‌లో "మెంబర్ లెడ్జర్ ఫారమ్" ఉంటుంది. దాని మీద నోట్ చేయ్యాలి.
- ★ అటెండెన్స్ మేకప్ రూల్స్ ప్రకారం సభ్యుల అటెండన్స్ నోట్ చెయ్యాలి.
- ★ సమావేశం తర్వాత మినిట్స్ కాపీలను సభ్యులకు సర్క్యులేట్ చెయ్యాలి.

## ఆహ్వానాలు ఎవరెవరికి పంపాలి?

సభా కార్యక్రమాల వివరాలు, ఆహ్వానాలూ నోటీసులూ వగైరా అన్నింటినీ క్లబ్ సభ్యులకు పంపేప్పుడు మీ మెయిలింగ్ లిస్ట్‌లో వీరినికూడా చేర్చుకొని, తప్పని సరిగా వీరికి పంపండి:

1. అంతర్జాతీయ లయన్స్ కార్యాలయం (బొంబే ఆఫీస్)

2. జిల్లా గవర్నర్

3. రీజియన్ ఛైర్మన్

4. జోన్ ఛైర్మన్

5. ప్రత్యేక సేవా కార్యక్రమం అయినప్పుడు ఆ ప్రత్యేక సేవా కార్యక్రమానికి సంబంధించిన జిల్లా కమిటీ ఛైర్మన్ (DISTRICT CHAIRMAN)

6. పురప్రముఖులు, లయనిజంపట్ల ఆకర్షితులైన వ్యక్తులు, ఆయా కార్యక్రమాలకు సంబంధించిన వివిధ ప్రభుత్వ అధికారులు. వీరినికూడా ముఖ్య కార్యక్రమాలకు ఆహ్వానిస్తూండండి.

## క్లబ్ ప్రోటోకాల్‌ను పాటించండి

- ★ వేదిక పైకి ఆహ్వానితుల్ని ఆహ్వానించడం, వారిని వేదిక పైన ఆసీనుల్ని చేయడం వారికి దండలు వేయడం, వారిచే సందేశాలిప్పించడం, మెమెంటోలు బహూకరించడం..... ఇవన్ని ప్రోటోకాల్‌ను బట్టి ఒక వరుస క్రమంలో జరుగుతాయి.
- ★ ఎవరు తక్కువ ఆఫీసర్ ఎక్కువ ఆఫీసర్ అనేది ఆయా పదవుల హోదాని బట్టి ఉంటుంది గానీ ఆయా వ్యక్తుల్ని బట్టి ఉండదు.
- ★ ఆర్డర్ ప్రకారం క్రిందనుంచి పైకి ప్రోటోకాల్ ఇలా ఉంటుంది.

క్లబ్ అధ్యక్షుడు → డిస్ట్రిక్ట్ ఛైర్మన్(DC) → జోన్ ఛైర్మన్(ZC) → రీజియన్ ఛైర్మన్(RC)→ డిస్ట్రిక్ట్ క్యాబినెట్ ట్రెజరర్(DCT) → డిస్ట్రిక్ట్ క్యాబినెట్ సెక్రటరీ(DCS) → పూర్వపు డిస్ట్రిక్ట్ గవర్నర్‌లు (Past Dist. Governers) → గత సంవత్సరం డిస్ట్రిక్ట్ గవర్నర్→ (Immediate Past Dist. Governor)→ వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్ (VDG)→ డిస్ట్రిక్ట్ గవర్నర్(DG) ఇలా డిస్ట్రిక్ట్ ఆఫీసర్లను వారి వారి హోదాల రీత్యా మనం గుర్తించాలి.

- ★ వీళ్ళంతా మన సమావేశానికి వచ్చారనుకుందాం.... వారిని వేదిక మీదకు పైన చెప్పిన వరుసలో ఆహ్వానించాలి.
- ★ అందరినీ ఆహ్వానించాక ఆఖరున ముఖ్యఅతిధిని ఆహ్వానించడం మన సాంప్రదాయం. మెమెంటోలు బహూకరించేటప్పుడు ముఖ్య అతిధికి ముందు బహూకరించి ఆ తరువాత ఇదే వరుసలో పైనించి క్రిందికి హోదాల ప్రకారం బహూకరించాలి. పూలదండలు వేసినా అంతే.
- ★ వేదిక పైన వారిని కూర్చో బెట్టేందుకూ ప్రోటోకాల్ నియమాలున్నాయి. ఈ వివరాలన్నీ ఈ చిత్రంలో గమనించండి.

| వేదిక కుడి వైపు | | | | | | | | | | వేదిక ఎడమ వైపు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| DC | RC | DCS | IPDG | DG | P | VDG | PDG | DCT | ZC | DC |

**ప్రఖ్యాత ఆయుర్వేద వైద్యులు, ఆయుర్వేద శాస్త్ర రహస్యాల్ని**
**సామాన్య మానవుడి ముంగిట చేరుస్తున్న ప్రసిద్ధ రచయిత**
**లయన్ డా॥ జి.వి.పూర్ణచంద్ గారి వైద్య రచనలు**

## దీర్ఘాయుష్మాన్ భవ

ఆరోగ్యవిధానాన్ని, విలువైన కాలాన్ని వృథా చేసుకోవడం కంటే, రోగాలను దరి చేరనీయకుండా ముందే జాగ్రత్తలు తీసుకోవడం మంచిది కదా.... ఆరోగ్య సంరక్షణ కోసం నిత్యపారాయణం చేయవలసిన ఆరోగ్య భగవద్గీత **వెల: 20-00**

## వంట ఇల్లే వైద్యశాల

చిన్నపాటి అనారోగ్యానికి కూడా ఆసుపత్రులకు పరుగెత్తకుండా అతి తక్కువ ఖర్చుతో కేవలం మన వంటింటి దినుసులతో ఆరోగ్యం పొందవచ్చునంటే మీరు ఆశ్చర్యపోతారు. కానీ, ఇది పచ్చి నిజం. తప్పక కొని భద్రపరచుకోండి. **వెల: 50-00**

## క్విక్ రెమిడీస్

వ్యాధులు చిన్నవైనా పెద్దవైనా వాటిని చిటికెలో తగ్గించుకోగలిగే చిత్రమైన ఆయుర్వేద చిట్కాలు ప్రయోగించి ఎలా ఉపశమనం పొందవచ్చో తెలియజేసే ఈ గ్రంథం మీ ఇంట్లో వుంటే ఒక పెద్ద మందులషాపు మీ ఇంట్లో వున్నట్లే. **వెల: 20-00**

## మీ వ్యాధులకు మీరే వైద్యులు

ఏవి తింటే రోగాలు పెరుగుతాయి? ఏవి తినకుండా వుంటే రోగాలు రాకుండా వుంటాయి? ఏఏ పనులు చేస్తే ఆరోగ్యం బావుంటుంది....... ఏఏ వ్యాధులు వచ్చినపుడు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి? ఇలాంటి అనేక ప్రశ్నలకు సమాధానాలు గల ఈ పుస్తకం ఆసాంతం మీరు చదివితే, మీ వ్యాధులకు మీరే వైద్యులు అవుతారు. **వెల: 60-00**

మీ అమూల్యమైన ఆర్డర్ల కొరకు




డోర్ నెం. 28-3-49, సంజీవయ్య కాలనీ,
అరండల్‌పేట, విజయవాడ - 520 002

## ఇవే సభా సాంప్రదాయాలు

## PARLIAMENTARY PROCEDURES

లయన్స్ క్లబ్ సమావేశాల్లో హుందాగా ప్రవర్తించడం వలన క్లబ్ ప్రతిష్ట, సభ్యుల ప్రతిష్ట పెంపొందుతాయి.

1. సమావేశాలకు సరిగ్గా సమయానికి రావడం ప్రతి సభ్యుడి విధి. ఆలస్యంగా వచ్చి త్వరగా పూర్తి కాలేదని ప్రశ్నించే వ్యక్తులు ఎక్కువ మంది వుంటారు. లయన్స్ విధిగా ఈ అలవాటుని మార్చుకొని సమయపాలనను అలవాటు చేసుకోవాలి.
2. క్లబ్ నాయకులు కూడా అలసత్వం వదిలి, వచ్చినంత మందితోనే సమావేశాలు ప్రారంభించే తెగింపుని అలవరచుకోవాలి.
3. మీటింగ్‌కు ఆలస్యంగా వచ్చిన వ్యక్తి వెనకసీట్‌లో మౌనంగా వచ్చి కూర్చోవాలి. ముందు సీట్లు కేటాయించిన వ్యక్తులు కూడా ఆలస్యంగా వస్తే సభా కార్యక్రమాలు డిస్టర్బ్ కాకుండా మౌనంగా వెనకసీట్లలోనే కూర్చుండిపోవడం సభామర్యాద అనిపించుకొంటుంది.
4. సభ ప్రారంభమైన తర్వాత పూర్తికాకమునుపే వెళ్ళిపోవలసిన పనులున్నవారు ముందుగా వచ్చి అలా వెళ్ళవలసి వుంటుందని అధ్యక్షుడి అనుమతి తీసుకోవడం సభ్యత! మధ్యలో వెళ్ళిపోదల్చిన వారు ఎజెండాలో ఒక కార్యక్రమం అయిపోయి, మరో కార్యక్రమం మొదలు కాబోయే గ్యాప్‌లో మౌనంగా ఎటువంటి హడావిడీ చేయకుండా నిష్క్రమించడం హుందాగా వుంటుంది.
5. సమావేశం ప్రారంభమైన తర్వాతగానీ, పూర్తికాకమునుపుగానీ, సమావేశం ఒకవైపు జరుగుతుండగానే టిఫిన్లు, భోజనాలు (ఏర్పాటు) చేయడం డిగ్నిఫైడ్‌గా వుండదు. బైటవారు వచ్చినప్పుడు ఇలాచేస్తే మనం వారి ముందు చులకన అయిపోతాం!
6. వేదికపైకి సందేశాల నిమిత్తం ఆహ్వానించినప్పుడు వేదికపైన ఆశీనులైన ప్రతి ఒక్కరినీ పేరు పేరున సంబోధించడం వలన కాలం చాలా వృధా అయిపోతుంది. ముఖ్య అతిథి, సభాధ్యక్షుడు తప్ప మిగతా ఎవ్వరూ ఇలా పేరుపేరునా సంబోధించవలసిన అవసరం లేదు.
7. ముఖ్య అతిథి ఎంత ఉన్నతుడైనాసరే, ముందుగా సభాధ్యక్షుణ్ణి సంబోధించడం మన సాంప్రదాయం. ముఖ్య అతిథిగా దేశ ప్రధానమంత్రి వచ్చినాసరే, ఆ సమావేశానికి క్లబ్ అధ్యక్షుడే అధ్యక్షత వహించడం కూడా మన ఉన్నత సాంప్రదాయమే! అధ్యక్షుడి తర్వాత ముఖ్య అతిథిని సంబోధించాలి. ఆ తర్వాత వేదికపైన ఆశీనులైన అందరికి ఒకే మాటలో నమస్కారం చెప్పి ప్రసంగంలోకి వెళ్ళవచ్చు.

8. బోర్డ్ మీటింగ్‌లోగానీ, జనరల్ బాడీ మీటింగ్‌లోగానీ సభ్యులు తమ తమ అభిప్రాయాలను స్పష్టంగానూ, నిర్దిష్టంగానూ చెప్పడం జరుగుతుంది. అయితే, మెజారిటీ సభ్యుల నిర్ణయాన్ని మాత్రమే అమలు చేయగలుగుతారు. ఈ మెజారిటీ నిర్ణయానికి దాన్ని వ్యతిరేకించినవారు కూడా బద్ధులే!

9. ఒక సభ్యుడు మాట్లాడుతుండగా మరొక సభ్యుడు అంతరాయం కల్గిస్తూ మాట్లాడడం (Cross Talking) తప్పు. మధ్యలో సభాధ్యక్షుడి మాధ్యమం (MEDIA)గా మనం సభలో మాట్లాడాలేగానీ, నేరుగా మరొక సభ్యుడితో వాదనకు దిగడం పార్లమెంటరీ సాంప్రదాయాలకు విరుద్ధం.

10. లయనిజంలో శిక్షణ వలన నేర్చుకున్న అనుభవాలు నిజ జీవితంలో కూడా మనకు క్రమశిక్షణతో మెలిగేందుకు ఎంతగానో తోడ్పడతాయి. ప్రజా సంబంధమైన పదవులు పొందే అవకాశం మనకు కల్గినప్పుడు, ఉన్నత వర్గంతో సమావేశం అయినప్పుడు లయనిజంలో మనం నేర్చుకున్న అనుభవాలు ఆనాడు మనకు ఎంతగానో ఉపకరిస్తాయి.

## అదనపు సమాచారం

## FOR INFORMATION

★ 1997 ఫిబ్రరి 28 నాటికి అంతర్జాతీయంగా 184 దేశాలు, ప్రాంతాలలో 724 లయన్స్ జిల్లాలలో 43, 509 లయన్స్ క్లబ్‌లున్నాయి. 1,430,305 మంది లయన్స్ సభ్యులు ప్రపంచవ్యాప్తంగా లయనిజంలో కొనసాగుతున్నారు.

★ **LCIFకు డొనేషన్లు**

1. 20 డాలర్లు చెల్లిస్తే CONTRIBUTING MEMBER అని లేపెల్ పిన్ బహూకరిస్తారు.
2. 100 డాలర్లు చెల్లిస్తే ప్రశంసాపత్రం - ఆనర్ రోల్
3. 1000 డాలర్లు చెల్లిస్తే MJF లేపెల్ పిన్, ఆవ్యక్తి పేరున చక్కని ప్లేక్
4. మొదటిసారి MJF అయిన తర్వాత : 1000 డాలర్ల నుంచి, 60వేల డాలర్ల వరకూ చెల్లిస్తే "PROGRESSIVE MJF" గౌరవం ఇస్తారు. మొదటి పది ప్రోగ్రెసివ్ ప్రోగ్రామ్‌ల్లోనూ వరుసగా వెయ్యి డాలర్లు చెల్లించిన ప్రతిసారీ ఒక్కొక్క వజ్రాన్ని పెంచుతూ వజ్రాల లేపెల్‌పిన్స్‌ని బహూకరిస్తారు. 11వసారి నుంచీ ఇంద్ర నీలం (SAPPHIRE) పొదిగిన లేపెల్ పిన్‌నిగానీ, రూబీ పొదిగినదిగానీ, బంగారంతో తయారయినదిగానీ వెయ్యి డాలర్లు చెల్లించిన ప్రతిసారీ బహూకరిస్తారు.
5. వెయ్యి డాలర్లను చెల్లించిన లయన్స్ క్లబ్‌కు ఒక ప్లేక్‌గానీ, బ్యానర్ ప్యాచ్‌గానీ బహూకరిస్తారు.

★ **LCIF ఆశయాలు ముఖ్యంగా మూడు :**

1. HUMINITARIAN SERVICES : స్థానికంగా చేసే సేవా కార్యక్రమాల నుంచి, ప్రపంచస్థాయిలో మానవతా విలువల కోసం చేపట్టే కార్యక్రమాలు వైద్య పరిశోధనలు కూడా జరుగుతున్నాయి.

2. VOCATIONAL TRAINING : ఏ ఆధారంలేని వారికీ, వికలాంగులకీ వారు స్వతంత్రంగా జీవించేందుకు కావలసినరీతిలో ట్రైనింగ్ ఇప్పించడం జరుగుతోంది.

3. MAJOR DISASTER RELIEF : ప్రకృతి విలయతాండవంచేసినచోట ప్రపంచంలో ఏమి జరిగినా, అక్కడ పునర్నిర్మాణ కార్యక్రమాలకోసం ఎంతో చేయూతనందిస్తున్నాయి. 1996లో కోనసీమలో జరిగిన పెనువిపత్తు సమయంలో గృహనిర్మాణంకోసం లక్షడాలర్లకుపైగా ఆర్థిక సహాయం ప్రకటించింది.

★ క్లబ్‌లో సభ్యులంతా MJF లయిన సందర్భంలో (100% MJF CLUBS) ఆ క్లబ్‌ను ప్రత్యేక బ్యానర్‌తో గుర్తించడం జరుగుతుంది. ఇలాంటి గౌరవం పొందిన క్లబ్‌లు ప్రపంచంలో 100కు పైగా ఉన్నాయి.

★ అత్యంత ప్రతిభావంతమైన సేవలుచేసిన వ్యక్తులనూ, సంస్థలనూ గుర్తించేటందుకు 1967వ సంవత్సరం నుంచి "లయన్సు హ్యూమానిటేరియన్ అవార్డ్" ఏర్పాటు చేశారు. మదర్‌తెరిసా, డా॥ మోడి, రాజీవ్‌గాంధీ ఫౌండేషన్, అరవింద యన్. మఫతలాల్ వంటి భారతీయ ప్రముఖులకు సంస్థలకు ఈ అత్యున్నత లయన్స్ అంతర్జాతీయ మానవతా పురస్కారం లభించింది.

★ ఆసియాలో మొదటి లయన్స్ అంతర్జాతీయ అధ్యక్షుడు టొయోటా (జపాన్)కు చెందిన KAURU "KAY" MURAKAMI. ఆయన 1981 జూన్ 20న ప్రమాణ స్వీకారం చేశారు. వారి తర్వాత రెండవ వ్యక్తి 1992లో లయన్స్ ప్లాటినమ్ జూబ్లీ సంవత్సరంలో భారతదేశానికి చెందిన లయన్ రోహిత్ సి. మెహతా, 76వ అంతర్జాతీయ అధ్యక్షుడు అయ్యారు.

★ "ది లయన్" మ్యాగజైన్ 30 ఎడిషన్లలో ప్రచురితమౌతోంది. 20 భాషల్లో వెలువడుతోంది. "రీడర్స్ డైజెస్ట్" పత్రిక తర్వాత అత్యధిక సర్క్యులేషన్ కల్గిన పత్రిక ఇదేనంటారు. లయన్స్ సభ్యులేకాక, సేవాభావం కల్గిన ఇతరులకు కూడా ఈ మ్యాగజైన్ సభ్యత్వం మనం చెల్లించి కానుకగా పంపవచ్చు. స్థానిక గ్రంథాలయాలకు మ్యాగజైన్ సభ్యత్వరుసుము చెల్లించి మనం డొనేషన్‌గా అందించవచ్చు.

★ లయన్స్ చిహ్నాల్ని 'లయన్స్' అనే పదాన్ని, లయన్స్ క్లబ్స్, లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్, లియో, లయనెస్ వంటి పదాల్ని ఎవ్వరూ స్వంతానికి వాడుకోవడానికి వీల్లేదు. లయనిజానికి సంబంధించిన స్టేషనరీపైన తప్ప, వ్యక్తిగతంగా వీటిని ఉపయోగించుకోవడాన్ని నిషేధించారు.

★ మనం మన క్లబ్ సమావేశానికి తప్పనిసరి పరిస్థితుల్లో హాజరుకాలేకపోయినప్పుడు 13 రోజుల్లోగా వేరొక సోదర లయన్స్ క్లబ్ సమావేశానికి హాజరయి ఆ క్లబ్ కార్యదర్శి నుంచి "అటెండెన్స్ స్లిప్" తెచ్చి ఇస్తే మన క్లబ్‌లో ఆబ్సెంట్ పడదు. ఇది అటెండెన్స్ మేకప్ రూల్"!

## క్లబ్ రెగ్యులర్ సమావేశాలలో ఎజెండా

## MODEL AGENDA FOR CLUB MEETINGS

1. MEETING CALL TO ORDER

లయన్స్ అంతర్జాతీయ సంస్థ నాభుజస్కంధాలపైన ఉంచిన బాధ్యతలు అధికారాల రీత్యా ఈ సమావేశాన్ని ప్రారంభిస్తున్నాను (I CALL THIS MEETING TO ORDER) అని లేచినుంచుని సన్నగా గ్రావెల్‌తో గ్యాంగ్‌పైన ధ్వనింపచెయ్యాలి.

2. PRAYER & FLAG SALUTATIONS
3. ప్రపంచ శాంతి కోసం ఒకనిమిషం మౌనం
4. అధ్యక్షుడి తొలి పలుకులు
5. సోదర సంస్థల నుంచి ఈ సమావేశానికి విచ్చేసిన లయన్స్ సభ్యుల పరిచయం. (VISITING LIONS RECOGNITION)
6. సెక్రటరీ రిపోర్ట్.
7. ముఖ్య అతిథి పరిచయం : (లేని గుణాలన్నీ చెప్పి మరీ పొగడడం కానీ, అలాగని పొడిపొడి మాటలతో ముఖ్య అతిథి ఔన్నత్యాన్ని తగ్గించేయకుండానూ చక్కగా సభకు పరిచయం చేయగలిగే వ్యక్తికి బాధ్యత అప్పగించండి.)
8. ముఖ్యఅతిథిని పుష్పమాలాంకృతుణ్ణి చేయడం.
9. ముఖ్య అతిథి ప్రసంగం.
10. ముఖ్య అతిథికి మెమెంటో బహూకరణ.
11. అధ్యక్షుడి మలి పలుకులు.
12. ఇతర కార్యక్రమాలు (ఏవైనా వుంటే).
13. టైల్ ట్విస్టర్ సమయం.
14. వందన సమర్పణ.
15. సమావేశం ముగింపు (Meeting is adjourned) అని ప్రకటించి మళ్ళీ గ్యాంగ్‌ని ధ్వనింప చేయాలి.

## క్లబ్ బోర్డ్ సమావేశాలు

## AGENDA FOR B.O.D. MEETINGS

1. అధ్యక్షుడిచే సమావేశ ప్రారంభం.
2. హాజరుకాలేని సభ్యులు ముందుగా తెలియజేసిన సమాచారం చదవడం.
3. అధ్యక్షుడి తొలి పలుకులు.
4. గత నెల బోర్డు సమావేశం మినిట్స్ ఆమోదం
5. సెక్రటరీ రిపోర్ట్, సభ్యత్వ వివరాలు, హాజరుకాని సభ్యుల వివరాలు
6. కోశాధికారి రిపోర్ట్.
7. గతనెల MM&A రిపోర్ట్ వివరాలు చదవడం.
8. వివిధ కమిటీల రిపోర్ట్‌లు.
9. గత సమావేశాలలో వాయిదా పడిన చర్చల కొనసాగింపు.
10. కొత్త విషయాల పై చర్చ (Discussion on New Business)
11. కొత్తగా సభ్యులను చేర్చుకునే విషయమై చర్చ.
12. ఇతర విషయాలు.
13. సమావేశం ముగింపు.



## రోజూ 20 పైసలు ఖర్చుచేయగల్గితే....ఈ సమాచారం మీ కోసమే....!

- విద్యా, విజ్ఞాన, ఆరోగ్యాల త్రివేణీ సంగమంగా ఇంటిల్లిపాదికీ విజ్ఞానాన్ని.. ఆరోగ్య విశేషాలను అందిస్తుందో ఒక్కసారి ఆ వివరాలు చూడండి. చూశాక, మీ మనసుకు నచ్చితేనే నెలకు ఆరు రూపాయలు మీ పత్రిక కోసం వెచ్చించండి.
- వివాహం కావలసిన పిల్లలు మీ ఇంట్లో ఉన్నారా? ఈ పత్రికలో వివాహ ప్రకటనలు ఉచితంగా ప్రకటించబడతాయి. మీ చిరునామా తెలియచేయడం మీకు ఇష్టంలేకపోతే ఉచితంగా బాక్స్ నెంబర్ సౌకర్యాన్ని కూడా ఏర్పాటుచేశాం.
- నిరుద్యోగులైన యువతీయువకులు మీ ఇంట్లో ఉన్నారా? వారి కోసం ఈ పత్రిక ఎన్నో పథకాలు చేపట్టింది. నెలనెలా మీ కార్యాలయంలో స్వయంగా ఓ చిన్న కుటీర పరిశ్రమను స్థాపించుకునేందుకు అనువుగా వృత్తి విద్యలలో శిక్షణ ఇచ్చి ఉచిత భోజన సదుపాయాల్ని కల్పించి సర్టిఫికెట్ కూడా ఇచ్చి పంపుతున్నాం. స్క్రీన్ ప్రింటింగ్, ఫ్రిజ్ మెకానిజం, గ్యాస్‌స్టవ్ మెకానిజం, కూలర్ మెకానిజం, చాక్‌పీస్‌ల తయారీ, బొట్టుబిళ్ళల తయారి ఇలా ఎన్నో ఫ్రీ ట్రయినింగ్ క్లాసుల్ని విజయవంతంగా నిర్వహించాం....... నెలనెలా నిర్వహిస్తాం కూడా.
- పెద్ద పెట్టుబడులు పెట్టి పరిశ్రమలు స్థాపించే స్తోమత లేని వారి కోసం సేల్స్ ప్రమోటర్స్ అన్న ఓ ప్రత్యేక పథకాన్ని ఆరంభించి ప్రతినెలా వినూత్నమైన ఎలక్ట్రానిక్, ఎలక్ట్రికల్ సాధనాలను పత్రిక ద్వారా పరిచయం చేస్తూ ఈ చిత్ర విచిత్ర వస్తువుల్ని సేల్సు ప్రమోటర్స్‌చే అమ్మించడం ద్వారా నెలనెలా వారికి రెండు వేల నుంచి ఏడెనిమిది వేల వరకూ చక్కని ఆదాయాన్ని అందించే ఏర్పాటు చేస్తుంది మా పత్రిక. రాష్ట్రవ్యాప్తంగా ఈ పథకంలో ఇప్పటికి నాలుగు వేలమంది నిరుద్యోగ యువతీ యువకులు కొనసాగుతున్నారు.
- సేవాభావంతో కేన్సర్, ఆస్త్మా, తెల్లమచ్చల వ్యాధిపీడితుల కోసం ప్రతినెలా 5, 20వ తేదీలలో మధ్యప్రదేశ్ నుండి ఋషివరప్రసాదితుడైన మంగీలాల్ మందును తెప్పించి మా సంస్థ ద్వారా రోగులకు అందించే సౌకర్యం కల్పించాం. ఇప్పటికే వేలసంఖ్యలో కేన్సర్, ఆస్త్మా, తెల్లమచ్చల వ్యాధి పీడితులు ఈ మందు వాడి వ్యాధిబాధల నుండి విముక్తులయ్యారు. ఈ మందుల పంపిణీ వివరాలన్నీ ఈ పత్రిక ద్వారా ఎప్పటికప్పుడు తెలియచేస్తున్నాం.
- పాఠకుల శ్రేయస్సు కోసం ఇన్ని ప్రజాహిత కార్యక్రమాలు నిర్వహిస్తున్నా ఇంకా, ఈ పత్రికలో అక్షరాక్షరం... విద్యా, విజ్ఞాన విశేషాలు అద్భుతాలు, పరమాద్భుతాలు నిండి ఉంటాయి. ఇది మాసపత్రిక. ఈ పత్రిక వెల కేవలం ఆరు రూపాయలు మాత్రమే. అందుకే అంటున్నాం రోజుకు 20 పైసలు వెచ్చించటానికి మీరు సిద్ధమైతే చాలు అని. ఈ పత్రికకు చందా చెల్లించాలనుకుంటే వండర్ వరల్డ్, విజయవాడ-2 అన్న మా చిరునామాకు ఓ కార్డ్ వ్రాయండి చాలు.

సదా మీ సేవలో

**మీ వండర్ వరల్డ్**

